# శ్రీ గీతామృతము

శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రులు



శ్రీ యతీంద్ర ప్రచురణలు
గంజాంవారివీధి :: కాకినాడ

తృతీయముద్రణము
సెప్టెంబరు - 1983
ప్రతులు - వేయి
సర్వస్వామ్య సంకలితము

వెల
సాదా ప్రతి
పది రూపాయలు
మేలి ప్రతి
పదిహేను రూపాయలు

ప్రకాశకులు :
శ్రీ యతీంద్ర ప్రచురణలు
గంజాంవారివీధి
కాకినాడ



ముద్రణ :
"ముముక్షువు"
పవరుపేట
ఏలూరు.

# ధ్యాన శ్లోకములు

శ్రీశైలేశ దయాపాత్రం
ధీ భక్త్యాది గుణార్ణవమ్
యతీంద్ర ప్రవణం వందే
రమ్య జామాతరం మునిమ్

లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్.

యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మ రుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే.

మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం య దేవ నియమేన మదన్వయానామ్,
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమ త్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా.

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్.

# స్వాచార్య స్తుతిః

భక్తావతంస మనఘం
భవసాగర తారకమ్
తాపత్రయహరం ధీరం
తత్త్వవిద్యా ప్రదాయకమ్
కల్యాణ గుణసంపన్నం
కరుణాపాంగ వీక్షణమ్
అజ్ఞాన తిమిరాదిత్యం
హరిభక్తి ప్రబోధకమ్
శమాది షట్క సంయుక్తం
అరిషట్క విదారకమ్
శ్రీకృష్ణ భజనానందం
సేవకాభీష్టదాయకమ్
సంపత్కుమార సచ్ఛిష్యం
కృష్ణాశ్రమ నివాసినమ్
సీతారామ యతీంద్రాఖ్యం
మద్గురుం సముపాస్మహే !

సీతారామ యతీంద్ర శ్రీ
భావ వాఙ్మయ బోధకమ్
సహస్రముఖ సందీప్తం
శ్రీ లక్ష్మణయతిం భజే !

# స్తోత్ర శ్లోకములు

జయతు జయతు దేవో దేవకీనందనోఽయం
జయతు జయతు కృష్ణో వృష్ణివంశ ప్రదీపః
జయతు జయతు మేఘశ్యామలః కోమలాంగో
జయతు జయతు పృథ్వీభారనాశో ముకుందః.

నమో నమో వాఙ్మనసాతి భూమయే
నమో నమో వాఙ్మనసైక భూమయే
నమో నమోఽనంత మహావిభూతయే
నమో నమోఽనంత దయైక సింధవే.

ప్రపన్న పారిజాతాయ
తోత్త్రైక పాణయే
జ్ఞానముద్రాయ కృష్ణాయ
గీతామృతదుహే నమః.

మూకం కరోతి వాచాలం
పంగుం లంఘయతే గిరిమ్
యత్కృపా తమహం వందే
పరమానంద మాధవమ్.

కృష్ణాయ వాసుదేవాయ
హరయే పరమాత్మనే
ప్రణత క్లేశ నాశాయ
గోవిందాయ నమో నమః.

వ్యాసం వసిష్ఠ నప్తారం
శక్తేః పౌత్ర మకల్మషమ్
పరాశరాత్మజం వందే
శుకతాతం తపోనిధిమ్.

అచతు ర్వదనో బ్రహ్మా
ద్విబాహు రపరో హరిః
అఫాల లోచన శ్శంభు
ర్భగవాన్ బాదరాయణః.

మల నిర్మోచనం పుంసాం
జల స్నానం దినే దినే
సకృ ద్గీతాంభసి స్నానం
సంసార మలమోచనమ్.

గీతా సుగీతా కర్తవ్యా
కిమన్యై శ్శాస్త్ర సంగ్రహైః ?
యా స్వయం పద్మనాభస్య
ముఖపద్మా ద్వినిస్సృతా.

సర్వోపనిషదో గావో
దోగ్ధా గోపాల నందనః
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా
దుగ్ధం గీతామృతం మహత్.

ఏకం శాస్త్రం దేవకీపుత్ర గీతం
ఏకో దేవో దేవకీపుత్ర ఏవ
ఏకో మంత్రో దేవకీపుత్రనామ
కర్మాప్యేకం దేవకీపుత్రసేవా.

# తొలిపలుకు

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే.

సకల భువనములను సహస్రనేత్రములతో కనిపెట్టి పరిపాలించునట్టి పరమాత్మ, శ్రీమన్నారాయణుడు, దుష్టులు చెలరేగి, భక్తులను బాధించి ధర్మమును పాడుచేయునప్పుడెల్లను తన భక్తులను కాపాడుటకై, దుర్మార్గులను శిక్షించుటకై, ధర్మమును పునరుద్ధరించుటకై అవతరించుచుండును. 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అని కృష్ణపరమాత్మ పరిపూర్ణావతారము. ఆయన అర్జునుని నిమిత్తమాత్రముగ చేసికొని, మనమందరమును తరించుటకై, జ్ఞానభాండారమైన గీతను మనకు ప్రసాదించి యున్నాడు. గీత అనగా సకలోపనిషత్తులయొక్క సారమే.

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః
పార్థో వత్సస్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్"

ఉపనిషత్తులన్నియును ఆవులు. అర్జునుడు దూడ. పితుకువాడు కృష్ణపరమాత్మయే. గీతామృతమే పాలు. అనుభవించువారు ముముక్షువులు. కనుక మోక్షమందభిలాషగల ప్రతివారును గీత నాశ్రయించియే తీరవలయును.

కాని, గీతలను అర్థము చేసికొనుట ఎట్లు ? గీతలలో ఏమి చెప్పబడియున్నది ? కొందరు జ్ఞానయోగమే గీతలయొక్క ఆదర్శ మందురు. కొందరు, కాదు - భక్తియోగమే అందురు. కొందరు-వారి కేమియును తెలియదు; కర్మయోగమునే గీతలలో కృష్ణపరమాత్మ ప్రతిపాదించినా డందురు. కొందరు జ్ఞానమూలకము, భక్తిప్రధానమునైన కర్మయోగమందురు. జ్ఞానమూలకమును, కర్మప్రధానమునైన భక్తియోగమని కొందరు. భక్తి మూలకము, కర్మప్రధానమునైన జ్ఞానయోగమని కొందరు. ఇట్లు ఎన్నెన్నిసిద్ధాంతములో చేసి, ఎన్ని నామకరణములో చేయుదురు. ఇది వారి వారి బుద్ధివిశేషముయొక్క చమత్కారము. వారి వారి బుద్ధిలో కొన్నికొన్ని సిద్ధాంతములు చేసికొని, వాటికి వారి వారి బుద్ధికి తగినట్లు ఆకారములు కల్పించుకొని, ఆ ప్రకారము ఫలాని ఫలాని యోగము అని నిర్ణయింతురు. ఎవరి కే యే ఆశయములు ప్రధానములుగ ఉండునో, వానిని సమర్థించుటకు గీత నాశ్రయింతురు. ఇంతకును ఏది కృష్ణపరమాత్మ అభిప్రాయము ? తెలిసికొనుట ఎట్లు ? అది అట్లుండనిండు.

బుద్ధి రెండురకములు-ఒకటి: వ్యవసాయాత్మికాబుద్ధి; రెండు: వాసనాత్మికాబుద్ధి. ఎన్ని జన్మములనుండియో అనేక విషయ వాసనలు పట్టుకొని రాగద్వేషములు, కామక్రోధాదులు మొదలగు మలినములు బుద్ధికి పట్టుకొనియుండును. అది వాసనాత్మికాబుద్ధి. దానికి యథార్థతత్త్వము గోచరించదు. ఆ బుద్ధి విచారించి చేయు ప్రతిసిద్ధాంతమును తన వాసనలు రాగ

ద్వేషములు మొదలగువాటి ననుసరించి యుండును. కాబట్టి అట్టి బుద్ధికి శాస్త్రములలోని సత్యసిద్ధాంతమును గోచరింపజేసికొను సామర్థ్యముండదు.

ఒక ఆధ్యాత్మిక గ్రంథమును అధ్యయనము చేయవలయు ననిన దానికి పూర్వము సాధనానుష్ఠానములచేత బుద్ధిని పరిశుద్ధమైన దానినిగ చేసికొనవలయును. అటుల తగిన శిక్షణము పొందిన బుద్ధియే వ్యవసాయాత్మికాబుద్ధి అనబడును. తరువాత సరియైన గురువులవద్ద కొంతకాల మధ్యయనము చేసి, యథార్థ జ్ఞానమును బడయువలయును. అంతియేగాని, కామక్రోధాదులకు నిలయమై, రాగద్వేషయుక్తమైన బుద్ధితో, ప్రాకృతపాండిత్యమును తోడుచేసికొని, ఎంత పరిశ్రమించినను వృథయే అగును.

"సూక్ష్మాగతిర్హి ధర్మస్య దుర్జ్ఞేయా హ్యకృతాత్మభిః"

ధర్మసూక్ష్మము తెలిసికొనుట చాల కష్టము. పరిశుద్ధాంతఃకరణులు కానివారు తెలిసికొనుట కెంతమాత్రమును అవకాశము లేదు. సరియైన పద్ధతి ప్రకారము బుద్ధికి తగుశిక్షణ నిచ్చి, మలినరహితమైన దానినిగ చేసికొని, మహాత్ముల కృపచేత ఉపదేశమును పొంది, నిష్కపట హృదయముతో, సత్యమును తెలిసికొనవలయునను ఆతురత గలిగి, పరమాత్మపై భారమువైచి, అధ్యయనము చేయుచున్నయెడల, ఆ పరమాత్మయే తన వాగ్దానము ప్రకారము సత్యమును గ్రహించుకొనగలిగిన బుద్ధిని మనకు ప్రసాదించును.

"తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే"

అని ఆయనయే గీతలో చెప్పియున్నాడు గదా!

నాయందు విశ్వాసము కలిగి, ఆశ్రమములో ఉండి, ఆధ్యాత్మిక సాధన చేయువారిలో చాలమంది గీతలకు వ్యాఖ్యానము వ్రాయవలసినదిగ నన్ను బలవంతపెట్టుచుండురు. కాని, "గీతల యథార్థ స్వరూపమును పూర్తిగ తెలిసికొన నాకు శక్యమా? నిష్కపట హృదయముతో తెలిసికొనవలయునని మాత్రము ప్రయత్నము చేయుచున్నాను. ఇంతవరకు నాకు తెలిసినది కూడ ఏకదేశమై యుండవచ్చును" అంటిని. "మాకు మీయందు విశ్వాసముగలదు, మీరు చెప్పినదే మాకు సత్యము. కాబట్టి మీకేది సత్యమని తోచినదో దానినే మాకు తెలుపుడు" అని వారనిరి. వారి పట్టుదలయొక్క ఫలితమే ప్రస్తుత మీ 'గీతామృత' మనుపేర వెలువడినది. ఇది యొక వ్యాఖ్యానము కాదు. గీతలను నే నర్థముచేసికొనిన విధమున వ్రాయబడిన అనువాద మనవచ్చును. ఆశ్రమములో ఉండి సాధనచేయువారికి గాని, లేక నాయందు విశ్వాసముగల తదితరులకుగాని సంస్కృతము చదివి అర్థముచేసికొనలేనివారికి గీతలలోని తత్త్వమును తెలిసికొనుటకు ఇది ఉపయోగించునని నా నమ్మకము.

ఒక శ్లోకమునకుగాని, ఒక శబ్దమునకుగాని అర్థవిచారణము చేయునప్పుడు, ప్రతిశబ్దములోని స్వారస్యమును గ్రహించుట అవసరమేగాని, అట్లు విచారించునప్పుడు కేవలము శబ్దార్థమునే

తీసికొని తృప్తిపడక, పూర్వాపర సందర్భములు, అప్పటి కాల పరిస్థితులు మొదలగున వన్నియును బాగుగ పరిశీలించి మరి గ్రహించవలయును. లేని యెడల అనేక బాధలు గలిగి, సత్యము నకు దూరమైపోవును.

నేను ఒక విషయమును ఉదాహరణముగ ఇచ్చుచున్నాను- పూర్వులు వ్రాసిన వ్యాఖ్యానములలోను, ఇప్పటివారు వ్రాసిన వ్యాఖ్యానములలోను కూడ ఒకటి రెండుచోట్ల ఈ విషయము కనపడినది. గీతలోని ప్రథమ శ్లోకము -

"ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కి మకుర్వత సంజయ ?"

ధృతరాష్ట్రు డడుగుచున్నాడు సంజయుని: "సంజయా! నావారు, పాండవులు, ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు యుద్ధముచేయ సంకల్పించి చేరినారు. ఏమి చేసినారు ?" అని.

దానికి వారు వ్యాఖ్యానము వ్రాసినారుగదా- "యుద్ధము చేయుటకు వెళ్ళినవారు 'ఏమిచేసినారు?' అని అడుగుట మొదట అసందర్భముగా కనుపించును. కాని, మహారాజు అభిప్రాయము - 'అది ధర్మక్షేత్రముగనుక దాని ప్రభావమువలన నావారి చిత్తములు మారి, పాండవులకు అర్ధరాజ్యమిచ్చినారా ? భీష్మద్రోణాదులు మహాత్ములు గనుక, వారిని దర్శించుటచేత నైనను, నావారి చిత్తములు ధర్మసంయుక్తము లైనవా ? లేక, ధర్మరాజు చిత్తము మరింత వైరాగ్యయుక్తమై, యుద్ధమునుండి విరమించి వెళ్ళినాడా ? ఏమి జరిగినది ?' అని భావము" అని వ్రాసినారు.

ఇది చదువుటకు వినుటకు మాత్రము సొంపుగ ఉండును. కాని, సత్యమునకు మాత్రము చాలదూరము. ఏమనిన, అసలు ధృతరాష్ట్రునిచేత ఈ ప్రశ్న వేయబడిన సమయమే భీష్ము డంపశయ్య నలంకరించినాడని సంజయుడు చెప్పగా వినినతరువాత. భారత యుద్ధారంభమునకుముందే వ్యాసులవారు వచ్చి, ధృతరాష్ట్రునితో "రాజా, నీకు దివ్యదృష్టి నిచ్చెదను. నీవు కూడ యుద్ధమును చూచెదవా?" అని అడిగెను. "నేను చివరకు దృష్టిని పొంది, నా కులక్షయమునకు కారణమైన యుద్ధమునా చూడవలసినది? చూడలేను. కాని, విషయములు ఎప్పటికప్పుడు వినగోరుచున్నా" ననినాడు ధృతరాష్ట్రుడు. అప్పుడు సంజయునకు దివ్యదృష్టినిచ్చి "నీవు సమస్తమును ఇచ్చటనుండియే చూడగలవు; వినగలవు. చాటున జరుగునవియును, బహిరంగమున జరుగునవియును, మనసులో గలుగు మార్పులును అన్నియును నీకు తెలియగలవు" అని చెప్పి వెళ్ళిపోయెను.

అప్పటినుండి యుద్ధసమాచారములు, సంజయుడు రాజుగారికి చెప్పుచునే యున్నాడు. యుద్ధము పదిరోజులు జరిగినది. భీష్ముడు రథమునుండి పడిపోయినాడు. అంపశయ్య నలంకరించినాడు. ఈ విషయము కూడ సంజయుడు రాజుగారికి చెప్పినాడు. ఆయనకు భీష్ముని పతనవార్త వినగానే ఎంతో విచారము కలిగినది. అప్పుడు మరల సంజయునితో, "ఏమీ! భీష్ముడే పడిపోయినాడా! ఎవరెవరు ఎవరెవరితో పోరిరి? ఏమి జరిగినది? ఎట్లు ప్రారంభించిరి? సర్వము విపులముగ చెప్పుము" అని అడిగినాడు. ఈ ప్రశ్నయే గీతలో మొదటిశ్లోకమై పరగుచున్నది. అప్పుడు మరల సంజయుడు ప్రారంభించినాడు.

గీతను కృష్ణు డర్జునునకు యుద్ధారంభమునందే చెప్పినాడు. సంజయుడు మాత్రము ధృతరాష్ట్రునకు పది దినములు యుద్ధము జరిగినతరువాత చెప్పినాడు. అంతవరకు యుద్ధము జరుగుచున్నదని ధృతరాష్ట్రునకు తెలియును. విషయములు మాత్రము క్లుప్తముగ వినుచున్నాడు. ఇప్పుడు విపులముగ చెప్పుమనుటచే మరల మొదటినుండియు చెప్పుచు, గీత ప్రారంభించినాడు.

తరువాత, "మహాత్ములైన భీష్మద్రోణుల సందర్శన మాత్రముచేత దుర్యోధనాదుల మనస్సులు ధర్మసంయుక్తము లైనవా ?" అనువానికి సమాధానము : రాయబారమునాడు సభలో మహాత్ములైన భీష్మద్రోణాదుల ఎదుటనే సాక్షా త్పరమాత్మయైన శ్రీకృష్ణుడే రాయబారము చేసినప్పుడు దుర్యోధనాదుల చిత్తములు ధర్మసంయుక్తములు కాలేదని తెలిసియేయున్న ధృతరాష్ట్రునకీ సందేహము కలుగుటకు అవకాశము కలదా ? ఇప్పు డాలోచింపుడు - ధృతరాష్ట్రుని ఈ ప్రశ్న కర్థ మేమియో? పదిరోజులనుండి యుద్ధముచేయక సైన్యము లట్లు నిలిచి యున్నవని వాని అభిప్రాయమా ? కాదు. కనుక వారి అభిప్రాయము నా బుద్ధికి మాత్రము పొసగినట్లు కాన్పిం చుటలేదు. ఇటువంటి వనేకము లున్నవి. కాని, నాదే సత్యమని ఇతరులను నమ్మించుటకు ప్రయత్నించుటలేదు. నే నేది సత్యమని గ్రహించితినో దానిని నన్ను విశ్వసించి అనుసరించువారి ఎదుట పెట్టుటయే నా విధ్యుక్త ధర్మమని మాత్రము పూర్తిగ నమ్ముచున్నాను.

సర్వజన శ్రేయోఽభిలాషి
సీతారాం.

ఓం శ్రీయఃపతయే నమః
ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీ గీ తా మృ త ము

## ప్రథమాధ్యాయము - అర్జున విషాదయోగము

ధృ త రా ష్ట్ర ఉ వా చ :

* ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కి మకుర్వత సంజయ ! 1

ధృతరాష్ట్రుడు అడుగుచున్నాడు :

సంజయా ! నా కుమారులైన దుర్యోధనాదులును, పాండురాజ కుమారులైన ధర్మరాజాదులును రాజ్యము కొరకై యుద్ధము చేయ సంకల్పించి వారివారి సైన్యములను తీసికొని, యుద్ధభూమియైన కురుక్షేత్రము చేరియున్నారు. యుద్ధప్రారంభము నుండియు ఇంతవరకు జరిగిన సమాచారమంతయు సవిస్తరముగ చెప్పుము.

స ం జ య ఉ వా చ :

* దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. 2

దు ర్యో ధ న ఉ వా చ :

* పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా. 3

సంజయుడు చెప్పుచున్నాడు :

వ్యూహముగ నమర్చబడిన పాండవుల సైన్యమునుజూచి, దుర్యోధనుడు ద్రోణాచార్యునితో ఇట్లు పలికెను - "ఆచార్యా! మీకు

శిష్యుడును, మంచి బుద్ధిమంతుడును, ద్రుపదమహారాజుయొక్క కుమారుడును అయిన ధృష్టద్యుమ్నునిచేత వ్యూహముగ తీర్చబడిన ఈ పాండవ సైన్యమును చూడుము !

* అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమా యుధి
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః. 4

* ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. 5

* యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవ మహారథాః. 6

"అందులో అందరును భీమార్జునులతో సమానులైన మహావీరులే. సాత్యకి, విరాటుడు, ద్రుపదమహారాజు, శిశుపాలునికుమారుడైన ధృష్టకేతువు, చేకితానుడు, కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ద్రౌపదీదేవి కుమారు లైదుగురును - ఇంకను అందరును గూడ గొప్ప ధనుస్సులు ధరించినవారును, మహారథులును అయి ఉన్నారు.

* అస్మాకంతు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ !
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. 7

* భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ. 8

* అన్యే చ బహవ శ్శూరా మదర్థే త్యక్త జీవితాః
నానాశస్త్ర ప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః. 9

"మన సైన్యములోనివారిని గూడ చెప్పుచున్నాను వినుము ! మీరును, భీష్ముడును, కర్ణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ,

వికర్ణుడు, సోమదత్తుని కుమారుడైన భూరిశ్రవుడు - వీరందరును గొప్ప ప్రముఖులు. వీరేగాక ఇంకను అనేక వీరులును, శూరులును అయినవారు నాకొరకై ప్రాణములమీాద ఆశకూడ లేక ఈ యుద్ధభూమియందు నిలబడి ఉన్నారు.

* అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్. 10

"కాని, భీష్మునిచే రక్షింపబడుచున్న మన సైన్యము సంఖ్యకు పెద్దదైనను, పాండవుల సైన్యమును జయించలేదని తలచెదను. భీమునిచేత రక్షింపబడుచున్న వారి సైన్యము, మనలను గెలువజాలి ఉన్నది.

* అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః
భీష్మ మే వాభిరక్షంతు భవంత స్సర్వఏవ హి. 11

"కనుక మీారందరును మన సైన్యముయొక్క అన్నిద్వారములందును జాగ్రత్తగ నిలచియుండి, అన్ని విధములచేతను భీష్మునే కాపాడవలయును."

స ం జ య ఉ వా చ :

* తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః
సింహానాదం వినద్యోచ్చై శ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్. 12

సంజయుడు చెప్పుచున్నాడు :

ఈ విధముగ పలుకుచున్న దుర్యోధనునకు ఆనందమును, ధైర్యమును కలిగించుటకై మంచిప్రతాపవంతుడును, వృద్ధుడును, కౌరవులకును పాండవులకునుకూడ తాతగారును అయిన భీష్ముడు సింహమువలె గొప్పగ గర్జించి, తన శంఖమును పూరించెను.

* తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః
సహసైవాభ్యహన్యంత స శబ్ద స్తుములోఽభవత్. 13

అంతట అనేకములైన శంఖములు, భేరులు, పణవములు, ఆనకములు, గోముఖములు అను పలురకములైన రణవాద్యములు ఒక్కసారిగా మ్రోగుటచే దిక్కులన్నియును దద్దరిల్లెను.

* తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః 14

అది విని, తెల్లనిగుఱ్ఱములను కట్టిన రథమునందు కూర్చున్న కృష్ణపరమాత్మయును, అర్జునుడును, తమ సైన్యముకూడ యుద్ధమునకు సిద్ధముగనే యున్నదను భావము తెలుపుచు, దివ్యములైన శంఖముల నొత్తిరి.

* పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. 15

* అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః
నకుల స్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ. 16

* కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖండీ చ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః. 17

* ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే
సౌభద్రశ్చ మహాబాహు శ్శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్ .18

కృష్ణుడు పాంచజన్యమును పూరించెను. అర్జునుడు దేవదత్తము నూదెను. శత్రుభయంకరుడైన భీముడు పౌండ్ర మను పేరుగల తన మహాశంఖమును, అనంతవిజయ మను శంఖమును ధర్మరాజును, నకుల సహదేవులు సుఘోషము, మణిపుష్పకము అను

శంఖములను పూరించిరి. మహాధనుస్సుగల కాశీరాజును, మహా రథుడైన శిఖండియును, ధృష్టద్యుమ్నుడును, విరాటరాజును, పరాజయ మెరుగని సాత్యకియు, ద్రుపదరాజును, ద్రౌపదీ కుమారులును, భుజబల సంపన్నుడైన అభిమన్యుడును-వీరందరును అన్నివైపులనుండి వేరువేరుగ తమతమ శంఖములు పూరించిరి.

* స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీం చైవ తుములోఽవ్యనునాదయన్. 19

ఓ ధృతరాష్ట్రమహారాజా! ఆ ధ్వనితో ఆకాశము, భూమియు బ్రద్దలయినట్లయినది. కౌరవుల హృదయములు కంపించిపోయినవి.

* అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః. 20

* హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే!
సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత! 21

అర్జున ఉవాచ:

పిమ్మట ఉభయసేనలును ఒకరిపై ఒకరు బాణములు ప్రయోగించుకొనుటకు సిద్ధముగనుండిరి. కపిధ్వజుడైన అర్జునుడు తన కెదుట నిలబడియున్న కౌరవులను జూచి, విల్లెక్కుబెట్టి కృష్ణునితో ఇట్లు పలికినాడు - "ఓ కృష్ణా! మన రథము నొకసారి రెండుసేనల మధ్యను పోనిమ్ము.

* యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్,
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే. 22

* యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః. 23

"దుర్మార్గుడైన దుర్యోధనుడు, తనలాభముకొరకు ఎవరెవరిని యుద్ధముసేయ నిలిపెనో, వారి నందరిని బాగుగ పరిశీలించి, ఎవరితో నేను పోరు ప్రారంభింపవలయునో నిర్ణయించుకొనవలసి యున్నది."

సంజయ ఉవాచ :

* ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత !
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథో త్తమమ్. 24

* భీష్మ ద్రోణ ప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూ నితి. 25

సంజయుడు చెప్పుచున్నాడు :

ఓ ధృతరాష్ట్రా ! ఈవిధముగ అర్జునుడు పలుకగా, సంతోషముతో ఉప్పొంగినవాడై కృష్ణుడు ఉత్తమమైన వాని రథమును తోలుకొనిపోయి, రెండుసేనల మధ్యభాగమున, భీష్ముడు, ద్రోణాచార్యులు మొదలగు ప్రముఖులయొక్కయు, సర్వ భూపాలురయొక్కయు ఎదుట నిలిపి "అర్జునా ! ఇదిగో ! సమావిష్టులైన కౌరవుల నందరిని చూడుము" అని చెప్పెను.

* తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః
పితౄ నథ పితామహాన్
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్
పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా. 26

* శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయోరపి,
తాన్ సమీక్ష్య స కౌంతేయ స్సర్వాన్ బంధూ నవస్థితాన్. 27

* కృపయా పరయావిష్టో విషీద న్నిద మబ్రవీత్.

అర్జున ఉవాచ :

దృష్ట్వేమం స్వజనం కృష్ణ ! యుయుత్సుం సముపస్థితమ్. 28

* సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే. 29

అప్పు డర్జునుడు సైన్యము నంతను తేరిపార చూచినాడు. ఎవరున్నారు యుద్ధభూమిలో ? రెండు సైన్యములందును గూడ తండ్రులు, తాతలు, ఆచార్యులు, మేనమామలు, సోదరులు, కుమారుళ్ళు, మనుమలు, స్నేహితులు, మామలు - ఇత్యాది బంధువులందరు కనుపించినారు. వారి నందరిని చూచునప్పటికి అర్జునుని హృదయము అతికరుణతో కరగిపోవుటచే, మిక్కిలి విచారము గలిగినవాడై, ఇటుల చెప్ప నారంభించెను- "కృష్ణా ! యుద్ధము చేయవలయు నని ఇక్కడ జేరిన వీ రందరును నా స్వజనము. వీరినా నేను సంహరించవలసినది ! ఆమాట తలచు కొనుట తోడనే నా అవయవము లన్నియును పట్టుతప్పిపోవు చున్నవి. నోటి తడి ఆరిపోవుచున్నది. శరీరము వణకుచున్నది. రోమాంచము గలుగుచున్నది.

* గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః. 30

"నా గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. చర్మమంతయును మండిపోవుచున్నది. నిలువజాలక యున్నాను. నా మనస్సు తిరిగిపోవుచున్నట్లున్నది.

* నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ !
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే. 31

"కృష్ణా! అన్నియును విపరీత లక్షణములే కనబడుచున్నవి. ఈ స్వజనమును చంపుటచే గలుగు మే లేమియు కనుపించదు.

* న కాంక్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖాని చ
కిం నో రాజ్యేన గోవింద! కింభోగై ర్జీవితేన వా. 32

"కృష్ణా! విజయమును కోరను. రాజ్యముక్కర లేదు. సుఖములపై ఆశలేదు. గోవిందా! నాకీ రాజ్యముతో పని ఏమున్నది? భోగము లేల? జీవించి లాభమేమి?

* యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖానిచ
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ. 33

"ఎవరికొఱకై రాజ్యమునుగాని, భోగములను గాని, సుఖములను గాని కోరవలసివచ్చునో, వారే ప్రాణములను, ధనములను వదలిపెట్టి యుద్ధమునకు సిద్ధముగ నిలబడి యున్నారు.

* ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః
మాతులా శ్శ్వశురాః పౌత్రా శ్శ్యాలాస్సంబంధిన స్తథా. 34

"ఆచార్యులు, తండ్రులు, పుత్రులు, తాతలు, మేనమామలు, శ్వశురులు, మనుమలు, బావమరదులు, వియ్యంకులు మొదలగు బంధువులందరు ఉన్నారు.

* ఏతా న్నహంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన!
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కింను మహీకృతే. 35

"వీరు నన్ను చంపిన చంపుదురుగాక, నేను మాత్రము వీరిని చంపను. భూమండలాధిపత్యమే గాదు, త్రైలోక్యాధిపత్య మిచ్చెదనన్నను యుద్ధము చేయను.

* నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యాజ్జనార్దన !
పాప మే వాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః. 36

"ఓ జనార్దనా ! ఈ కౌరవులను సంహరించుటచేత మాకేమి సంతోషము కలుగును? వీరెంత దుర్మార్గులైనను వీరిని చంపుటచేత మనకు పాపమే లభించును.

* తస్మా న్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ ! 37

"కాబట్టి బంధుజనులతో కూడియున్న కౌరవులను చంపుట మంచిదికాదు. స్వజనులను చంపి ఏమి సుఖమందగలము కృష్ణా !

* యద్య ప్యేతే న పశ్యంతి లోభోపహత చేతసః
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్. 38

"పిసినిగొట్టుతనముచేత మతి చెడినవారికి కులక్షయము వలన గలుగు దోషమును, మిత్రులకు ద్రోహముచేయుటచే గలుగు పాతకమును కనుపింపవు.

* కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన ! 39

"కాని, మాకు కులము నశింపజేయుటచే గలుగు దోషము బాగుగ కనుపించుచున్నది. అయినప్పుడీ పాపము నింక ఎట్లు చేయగలము? ఏమైనను సరే, ఇట్టి పాపకృత్యమున కింక పాల్పడను.

* కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవ త్యుత. 40

"కులము నశించెనేని సనాతనములైన కులధర్మములు నశించును.

ధర్మము నశించిన లోకమున కులములన్నియు అధర్మముచే వ్యాప్తములై పోవును.

* అధర్మాభిభవాత్ కృష్ణ! ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసంకరః 41

"కృష్ణా! అధర్మము వ్యాపించిన వెంటనే కులస్త్రీలు చెడిపోవుదురు. స్త్రీలు చెడిపోవుటచేత వర్ణసాంకర్యము కలుగును.

* సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియాః. 42

"వర్ణసాంకర్యము కలుగగనే దానికి కారకులైన కులఘాతుకులును, కులములును నరకమున కూలుట తథ్యము. పిండ దాన తర్పణాది క్రియలు జరుపువారు లేకపోవుటచేతను, అధికారములేనివారు జరిపినను అవి ముట్టకపోవుటచేతను వారి పితృదేవతలు సైతము నరకమున పడిపోవుదురు.

* దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకర కారకైః
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః 43

"కులఘాతుకులయొక్క వర్ణసంకర కారణములైన ఈ దోషముల చేత, సనాతనములైన జాతిధర్మములును, కులధర్మములును చెడగొట్టబడుచున్నవి.

* ఉత్సన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన!
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. 44

"ఏ మానవుల కులధర్మములు చెడిపోయినవో, వారికి నరకమే నిశ్చయమని మనము వినలేదా కృష్ణా!

* అహో బత మహత్ పాపం కర్తుం వ్యవసితా వయమ్
యద్రాజ్య సుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః. 45

"రాజ్యము యొక్కయు, సుఖము యొక్కయు ఆశ చేత, స్వజనులను సైతము చంపుటకు సిద్ధపడుచున్నాము - అయ్యో! మన మెంత పాపము చేయుటకు సిద్ధముగ ఉన్నామో చూడుము!

* యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్. 46

"ఇంతకంటె, వారుచేసిన అపకారమునకు ప్రత్యపకారము చేయకయు, ఆయుధములు ధరించకయు ఉన్న నన్ను కౌరవులు చంపినయెడల నాకు చాలమేలే కలుగును."

సంజయ ఉవాచ :

* ఏవ ముక్త్వార్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్న మానసః 47

సంజయుడు చెప్పుచున్నాడు :

ఇట్లు చెప్పి, అర్జునుడు విల్లును, బాణములను జారవిడిచి, దుఃఖములో మునిగిన మనస్సుతో రణరంగమున రెండుసేనల మధ్యమున నున్న తన రథముపై చతికిలపడెను.

ఓం తత్సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే అర్జున విషాదయోగోనామ
ప్రథమోఽధ్యాయః

ఓం శ్రియఃపతయేనమః
ఓం శ్రీ పరమాత్మనేనమః

# శ్రీ గీ తా మృ త ము

## ద్వితీయాధ్యాయము – సాంఖ్యయోగము

సంజయ ఉవాచ :

* తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః. 1

సంజయుడు చెప్పుచున్నాడు:

ఓ మహారాజా ! ఈ విధముగ కరుణచే ద్రవించిన మనస్సు గలవాడై కన్నీరుగార్చుచు దుఃఖించుచున్న అర్జునుని జూచి కృష్ణపరమాత్మ ఈ రీతిగ చెప్పుచున్నాడు.

శ్రీ భగవా నువాచ :

* కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ! 2

* క్లైబ్యం మాస్మగమః పార్థ ! నైత త్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ! 3

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

అర్జునా! ఏమిది? ఈ మనోవైకల్య మెక్కడనుండి వచ్చినది ? అజ్ఞానులకు తగినది, అధోగతిపాలు చేయునది, అపకీర్తికి మూలమైనది, ఈ ఒడుదుడుకు సమయములో నీ కెక్కడనుండి దాపురించినది ? అర్జునా! ఇట్లు పిరికివాడవు కాకుము. ఎంతటి శత్రువునైనను జయించగల నీవంటివానికిది తగునా ? ఛీ ! నీచమైనదియు, క్షుద్రమైనదియు అగు హృదయదౌర్బల్యమును వదలిపెట్టి లెమ్ము ! యుద్ధమునకు సిద్ధముకమ్ము !

అర్జున ఉవాచ:

* కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన!
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన! 4

అర్జును డడుగుచున్నాడు:

"కృష్ణా! భీష్ముడును, ద్రోణాచార్యులును నాకు పరమపూజ్యులు గదా! అట్టివారిని పూజించుటకు మారు, వారిమీద బాణములు ప్రయోగించి, ఎదిరించి యుద్ధ మెట్లు చేయగలను? మన సెట్లొప్పును?

* గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్యమ పీహ లోకే
హత్వార్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్. 5

"పూజనీయులైన గురువుల జంపి, రాజ్య మనుభవించుట కంటె, వారితో యుద్ధముచేయక రాజ్యమును వదలి, బిచ్చమెత్తుకొని జీవించుట చాల శ్రేయస్కరము. గురువుల జంపి, అర్థకామ రూపములైనవియు, వారి రక్తముచే పూయబడినవియు అగు భోగముల ననుభవింపవలసి వచ్చును.

* న చైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః
యా నేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. 6

"ఏమిచేయుటకును తెలియకున్నది. వారిని మనమే జయింతుమో, వారే మనల జయింతురో! యుద్ధము చేయుటయా, మానుటయా?

ఏది శ్రేయస్కరమో తెలియుటలేదు. ఎవరిని చంపిన యెడల నేను బ్రతుకుటకు కూడ ఇష్టపడనో, అట్టి బంధువులైన కౌరవులే యుద్ధము చేయ సమకట్టి ఎదుట నిలబడి యున్నారు.

* కార్పణ్యదోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి త న్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. 7

"పూజ్యులను, బంధువులను, ఎట్లు చంపుదునా అను దైన్యమును, మనము చేయబోవు యుద్ధమువలన నాకు కన్పించు దోషములను నా బుద్ధిని చెడగొట్టినవి. అందుచేత 'ఇది ధర్మము; ఇదిఅధర్మము' అని విచారణ చేయలేకుండ ఉన్నాను. కనుక నిన్నడుగుచున్నాను. కృష్ణా! నాకేది శ్రేయస్కరమో నీవే నిశ్చయించి చెప్పుము! నేను నీకు శిష్యుడను. నిన్ను శరణు జొచ్చుచున్నాను. నీవే దిక్కు. నాకు బోధచేసి మంచిమార్గమున నడుపుము.

* న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్య చ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్
అవాప్య భూమా వసపత్న మృద్ధమ్
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్. 8

"ఎందులకనగా, నాచిత్తము మిక్కిలి కలత చెంది ఉన్నది. ఈ దుఃఖము నా ఇంద్రియములను గూడ శోషింపజేయుచున్నది. ఎదురులేనట్టియు మిక్కిలి సమృద్ధి గలిగినట్టియు రాజ్యముగాని, దేవతలపై ఆధిపత్యముగాని, ఇప్పటి నా యీదుఃఖమును పోగొట్ట జాలవు."

సంజయ ఉవాచ :

* ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః
న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవ హ. 9

* త మువాచ హృషీకేశః ప్రహస న్నివ భారత!
సేనయో రుభయో ర్మధ్యే విషీదంత మిదం వచః. 10

సంజయుడు చెప్పుచున్నాడు :

ఈ విధముగ అరిభీకరుడైన అర్జునుడు కృష్ణపరమాత్మను గూర్చి పలికి, యుద్ధము చేయనని ఊరకుండెను. ఓ మహారాజా! రెండు సైన్యములమధ్యను యుద్ధము చేయనని అట్లు కూర్చున్న అర్జునుని జూచి,శ్రీకృష్ణుడు నవ్వుచున్న వానివలె ఇట్లు చెప్పెను:

శ్రీ భగవానువాచ :

* అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. 11

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

ఓ అర్జునా! నీవు ఏ విషయమును గూర్చి దుఃఖించ నక్కర లేదో, దానినిగూర్చి దుఃఖించుచున్నావు. పైగా అన్నియు తెలిసిన పండితులు మాట్లాడినట్లు మాట్లాడుచున్నావు. ఇదిగో చెప్పుచున్నాను- శ్రద్ధగా వినుము - పండితులైనవారు చచ్చిన వారిని గూర్చియును, బ్రతికియున్నవారిని గూర్చియును గూడ దుఃఖించరు.

* న త్వేవాహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతఃపరమ్. 12

నేను ఇదివరకు ఒకప్పుడును లేకపోలేదు. నీవును, ఈ రాజులును లేకపోలేదు.మనమందరమును కూడ ఇకముందు ఉండ మనునదియు

లేదు. భూత భవిష్య ద్వర్తమానకాలములయం దెప్పుడును మన మందరమును ఇట్లు నిత్యులమై యుండువారమే.

* దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి.        13

దేహధారులైన ప్రతివారికిని, ఈ దేహమునందు బాల్యము, యౌవనము, ముసలితనము ఎట్లు సంభవించుచున్నవో, అదే విధమున ఈ దేహము నశించిన పిమ్మట మరియొక దేహము ప్రాప్తమగుచున్నది. ఆ విషయములో ధీరుడైనవాడు వ్యసనమును పొందడు.

* మాత్రాస్పర్శాస్తు కౌంతేయ ! శీతోష్ణ సుఖదుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత !        14

అర్జునా ! శబ్ద స్పర్శ రూప రస గంధములతో ఇంద్రియములకు సంయోగము గలిగినప్పుడు, శీతోష్ణ సుఖదుఃఖములు కలుగుచున్నవి. వీనికి పుట్టుకయు నాశమును గలవు. కావుననే అనిత్యములు. వీటిని నీవు సహించుకొనుము.

* యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ !
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే.        15

ఈ విషయములు సుఖదుఃఖములను రెంటిని సమముగ చూచుకొను ధీరుడైన పురుషుని బాధింపజాలవు. అట్లు వానిచేత చలించని పురుషుడేగదా అమృతత్వము కొరకు - అనగా మోక్షము కొరకు - అర్హుడగుచున్నాడు !

* నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽ న్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః.        16

నశించుటయే స్వభావముగా గల శరీరములకు నిలుకడ యనునది లేదు. నిత్యమైన ఆత్మలకు నాశమనునది లేదు. జడస్వరూపమైన దేహమునకు అసత్త్వమే - అనగా నాశనమే- స్వరూప మనియు, చేతనమైన ఆత్మకు సత్త్వమే - అనగా నిత్యత్వమే, ఎన్నడును నశింపకుండుటయే - స్వరూపమనియు జ్ఞానులైనవారు బాగుగ పరిశీలించి నిర్ణయించినారు.

* అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి. 17

ఈ సమస్త దేహము, ఏ ఆత్మతత్త్వముచేత వ్యాప్తమై యున్నదో, అది నాశము లేనిదని తెలిసికొనుము. నాశములేని దీనిని ఏదియును నశింపచేయలేదు. ఏవిధముచేతను ఆ తత్త్వము నాశము పొందదు. శరీరతత్త్వము నశింపక యుండదు.

* అంతవంత ఇమే దేహా నిత్య స్యోక్తా శ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత! 18

ఈ దేహము లన్నియును అనిత్యములు. అంతము కలవి. ఆత్మ మాత్రము జననమరణ రహితము, నిత్యము, నాశములేనిది, తాను తెలిసికొనునది. కాని, ఇతరముచేత తాను తెలియబడునది కాదు. అనగా క్షేత్రజ్ఞుడు - క్షేత్రమైన దేహమును తెలిసికొను వాడుగాని, దేహముచేత తెలియబడువాడు కాడు. ఇట్లు మహాత్ములచే చెప్పబడినది. అందుచేత, పనికిరాని ఈ దుఃఖమును వదలిపెట్టి, ఓ అర్జునా! యుద్ధము చేయుము.

* య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే. 19

ఆత్మను చంపు సాధన మేమియును లేదు. ఆత్మ చావదు. ఏదో సాధనము ఆత్మను చంపునని గాని, ఆత్మ చచ్చునని గాని తలచు ఇద్దరును అజ్ఞానులే. ఆత్మ చంపదు, చంపబడదు.

* న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్య శ్శాశ్వతో౾యం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. 20

ఇది ఒకప్పుడు పుట్టునదిగాని, ఒకప్పుడు చచ్చునదిగాని కాదు. ఒకప్పు డుండి, ఒకప్పుడు ఉండనిదియును కాదు. అజమును, నిత్యమును, శాశ్వతమును, పురాతనమును అయిఉన్నది. శరీరము వధింపబడినను, ఇది మాత్రము చంపబడదు.

* వే దావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్
కథం స పురుషః పార్థ ! కం ఘాతయతి హంతి కమ్ ? 21

ఎవ డీ ఆత్మను నాశము లేనిదిగను, నిత్యమైనదిగను, పుట్టుక లేనిదిగను, అవ్యయమైనదిగను ఎరుగునో, ఆ పురుషుడు ఏ ఆత్మను ఎట్లు చంపును ? ఎట్లు చంపించును ?

* వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరో౾పరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ. 22

మానవుడు ప్రాతవస్త్రములను వదలి, క్రొత్తవస్త్రముల నెట్లు ధరించునో, అదేరీతిని ఆత్మయును శిథిలమైన దేహములను త్యజించి, ఇతరమైన క్రొత్త దేహములను పొందుచుండును.

* నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః
నచైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః. 23

ఈ ఆత్మను కత్తులు నరకలేవు. అగ్ని కాల్చలేదు. నీరు తడుప లేదు. వాయువు ఎండించలేదు.

* అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ
నిత్య స్సర్వగత స్థ్సాణు రచలోఽయం సనాతనః. 24

నరకబడనిదియు, తగులబెట్టబడనిదియు, తడుపబడనిదియు, ఎండింపబడనిదియు నగు ఈ ఆత్మ నిత్యము, సర్వవ్యాపి, స్థిరమైనది, చలించనిది, సనాతనమునై యున్నది.

* అవ్యక్తోఽయ మంచిత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే
తస్మా దేవం విది త్వైనం నానుశోచితు మర్హసి. 25

ఈ ఆత్మ ఇంద్రియముల కందనిదియును, మనస్సుచేత ఊహించుటకు శక్యముకానిదియును, దేనిచేతను వికారము పొందింపరానిదియును అని చెప్పబడుచున్నది. అందుచేత ఆత్మను ఈ విధముగ తెలిసికొన్నవాడవై దుఃఖమును మానుము.

* అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్
తథాపి త్వం మహాబాహో! నైవం శోచితు మర్హసి. 26

* జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మమృతస్య చ
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. 27

ఒకవేళ ఈ ఆత్మ ఒకప్పుడు పుట్టునది అనియును, ఒకప్పుడు చచ్చునది అనియును తలచుచున్నావా ? అట్లైనను నీవు దుఃఖించవలసిన పనిలేదు. పుట్టినవారికి మరణము తప్పదు; మరణించినవారికి పుట్టుక తప్పదు. కనుక, నివారించుటకు వీలుతేని

ఈ విషయమున దుఃఖించి ప్రయోజన మేమున్నది ? కాబట్టి ఎటు చూచినను నీవు దుఃఖించరాదు.

* అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత !
అవ్యక్త నిధనా న్యేవ తత్ర కా పరిదేవనా ? 28

అర్జునా ! మనుష్యాది శరీరములు మొదలగు సర్వభూతములును ఎక్కడినుండి వచ్చుచున్నవో తెలియదు. మధ్యమాత్రము తెలియుచున్నది. మరల మరణించిన తరువాత ఏమాచున్నవో తెలియదు. కనుకనే అవ్యక్తమైన ఆదియును, వ్యక్తమైన మధ్యమును, అవ్యక్తమైన అంతమును కలవని తలపవలయును. కాబట్టి ఈ విషయమున దుఃఖమెందులకు ?

* ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్. 29

ఈ ఆత్మ నొకానొక డాశ్చర్యముగ చూచుచున్నాడు. ఒక డాశ్చర్యముగ చెప్పుచున్నాడు. అట్లే ఒక డాశ్చర్యముగ వినుచున్నాడు. ఒకానొకడు వినికూడ ఈ ఆత్మను తెలిసికొన లేకుండ ఉన్నాడు.

* దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత !
తస్మా త్సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి. 30

దేహము చంపబడుచున్నదేగాని, ఆత్మ మాత్రము ఎప్పుడును చంపబడదు. కావున నీవు సమస్తభూతములలో దేనిని గురించి యును విచారించనక్కరలేదు.

* స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే. 31

అంతియే కాదు, నీ స్వధర్మము నాలోచించినైనను నీవు భయము వదలి పెట్టవలయును. ఎందులకన, క్షత్రియునకు ధర్మయుద్ధముకంటె శ్రేయస్కరమైన కర్తవ్య మింకొకటి లేదు.

* యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్
సుఖినః క్షత్రియాః పార్థ ! లభంతే యుద్ధమీదృశమ్. 32

అర్జునా ! జాగ్రత్తగా ఆలింపుము. తనంతట తానే తెరువబడి, ఏ అడ్డును లేక లభించిన స్వర్గద్వారము వంటి ఈ ధర్మయుద్ధము, గొప్ప సుకృతముచేసికొన్న క్షత్రియులకుగాని లభించదు. కాబట్టి నీవు యుద్ధము చేసియే తీరవలయును.

* అథ చే త్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి. 33

ఇదిగో! ధర్మయుక్తమైననుసరే, నేను యుద్ధముచేయనందువేమో, చేయనియెడల, స్వధర్మమును కీర్తినిగూడ పోగొట్టుకొన్నవాడవై పాపమునే అనుభవించెదవు.

* అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే. 34

అందరును శాశ్వతముగ నీ అపకీర్తినే చెప్పుకొనుచుందురుకూడ. నీవంటి శూరులు, వీరులు అపకీర్తిని సహించలేరు. అపకీర్తి మరణముకంటె మించినది.

* భయా ద్రణా దుపరతం మంస్యంతే త్వాం మహారథాః
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్. 35

మహారథులందరిచేతను ఇంతవరకు చాల గౌరవింపబడుచున్నావు. అట్టి నిన్నిప్పుడు వారు, పిరికివాడవై భయముచేత యుద్ధమునుండి విరమించుకొనుచుంటివని తలచి, మిక్కిలి చులకనగ చూతురు.

* అవాచ్య వాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః
నిందంతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్? 36

నీ శత్రువులు నీ సామర్థ్యమును గూర్చి నిందించుచు, చెప్పగూడని అనేకములైన దుర్భాషలు పలుకుచుందురు. నీకింతకంటె విచారకరమైన దేమున్నది?

* హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ! యుద్ధాయ కృతనిశ్చయః 37

ఒకవేళ నీవు యుద్ధమందు మరణించిన స్వర్గ మనుభవించెదవు; జయించిన రాజ్య మనుభవించెదవు. కనుక అర్జునా! యుద్ధము చేయుటకే నిశ్చయించుకొని లెమ్ము!

* సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి. 38

సుఖదుఃఖములయందును, లాభనష్టములయందును, జయాపజయముల యందును సమభావము కలిగి యుద్ధము చేయుటకు సిద్ధము కమ్ము. ఇట్లు చేయుటచేత నీకు పాపము లంటవు.

* ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబంధం ప్రహాస్యసి. 39

అర్జునా! నీకింతవరకును ఆత్మతత్త్వమును గూర్చి- అనగా ఆత్మ నిత్యమనియు, అవినాశియనియు, దానికి చావుపుట్టుకలు లేవనియు- ఇత్యాది జ్ఞానము ఉపదేశించితిని. ఇప్పుడట్టి వివేకము కలిగియున్న

కర్మబంధము లన్నిటిని త్రెంచుకొనగలుగుదువో-అనగా కర్మలు చేసినను, అవి నిన్ను బంధించవో- ఆ విషయమును చెప్పెదను- వినుము.

* నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే
స్వల్పమ ప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ .40

ఇప్పుడు నేను నీకు చెప్పబోవుచున్న ఈ ధర్మము, ఆరంభించి పూర్తిచేయ లేకపోవుటచేత నిష్ఫలమును కాదు, మధ్యమధ్య చిన్నలోపములు వాటిల్లినను ప్రత్యవాయమును లేదు. ఈ ధర్మమును ఎంత స్వల్పముగ చేసినను మహాభయమునుండి-అనగా సంసారమునుండి - రక్షించుచున్నది.

* వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన !
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్. 41

అర్జునా ! ఈ ధర్మమునందు - అనగా కర్మయోగమునందు - ప్రవర్తించు మానవులు రెండు రకములుగ ఉందురు. వ్యవసాయాత్మికాబుద్ధి కలవారు ఒక రకము. వీరి బుద్ధి సాధనానుష్ఠానములచేత మలినరహితమై కామ్యములన్నియు నశించి, మోక్షమునందు మాత్రమే నిశ్చయముకలదై యుండును. రెండవరకపు వారి బుద్ధులు పూర్వజన్మల యొక్క బహువాసనలచేత కామ్యములకు లోనై, బహుశాఖలు కలవిగను, అనంతములుగను ఉండును.

* యామిమాం పుష్పితాం వాచం ప్రవదం త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ ! నాన్య దస్తీతి వాదినః 42

* కామాత్మాన స్స్వర్గపరా జన్మ కర్మ ఫలప్రదామ్
క్రియావిశేష బహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి. 43

* భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృతచేతసామ్
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే. 44

కొందరు వేదములందు చెప్పబడిన ఫలశ్రుతి వాక్యములందే ప్రీతికలవారలై, భోగములందే తన్మయులై యుందురు. వారికి స్వర్గఫలమే గమ్యస్థానము. దానికి మించినది లేదు. ఎప్పుడును దారేషణ, పుత్రేషణ, ధనేషణలయందే మనస్సుకలిగి, అందుచేత యథార్థ తత్త్వమును తెలిసికొనలేక అజ్ఞానులై, కామోపభోగము లనుభవించుటకంటె వేరేమియు లేదని చెప్పుచు, జన్మ పరంపరలను కలుగజేయునట్టి విశేషమైన కర్మకలాపమునందు మునిగి తేలుచుందురు. వారు చెప్పు మాటలు - ఫలరహితమై, పుష్పములతో మాత్రము నిండి, చూపుల కింపుగ ఉండు చెట్లవలె - అల్పఫలములు గలవై వినుట కింపుగ నుండును. అట్టివారికి వ్యవసాయాత్మికాబుద్ధి ఎట్లు కలుగును? వారి బుద్ధి ఎప్పుడును చంచలముగనే ఉండును. పరమాత్మయందు నిలువదు.

* త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున!
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. 45

అర్జునా! వేదములు సత్త్వరజస్తమోగుణములు కలవారిని ఉద్ధరించుటకై, వారివారికి తగిన విధమున కర్మలను విధించినవి. అందుచేత వేదములు త్రైగుణ్యములు. నీవు గుణాతీతుడవును, ద్వంద్వములు లేనివాడవును, నిత్యమైన పరమాత్మయందే నిలచినవాడవును కమ్ము. యోగక్షేమములను గూర్చిన ఆలోచనను వదలిపెట్టుము. మనస్సును బాగుగ నిగ్రహించుము.

* యావా నర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే
తావా స్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః 46

మానవునకు ఎచ్చటచూచినను మధురజలముతో నిండి యున్నప్పుడు నూతులతో ఏమిపని ? అదే విధమున సర్వభోగము లను త్యజించి, పరమాత్మను తెలిసికొనిన మహాత్ములకు వేదములతో ఏమిపని ?

* కర్మణ్యే వాధికార స్తే మాఫలేషు కదాచన
మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సంగోఽ స్త్వకర్మణి. 47

నీకు నీయొక్క వర్ణాశ్రమములకు సంబంధించిన నిత్యనైమిత్తికాది కర్మలు చేయుటయందే అధికారము కలదు. కాని, వాటికి సంబంధించిన ఫలములయం దధికార మెప్పుడును లేదు. కాబట్టి అహంకారమును, ఫలాపేక్షను వదలి కర్మలుచేయుము. కర్మల నాచరింపకుండుటయందు నీకాసక్తి కలుగకుండునుగాక !

* యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ !
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. 48

ఓ అర్జునా! నీవు ఆసక్తిని విడిచిపెట్టి, నీవు చేయు కర్మ ఫలించినను ఫలించక పోయినను సమభావము కలిగి కర్మలుచేయుము. లాభ నష్టములయందు సమభావము గలిగి యుండుటయే యోగమని చెప్పబడుచున్నది.

* దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ !
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. 49

ఇంతవరకును నీకు చెప్పిన ఈ నిష్కామ కర్మయోగమును బుద్ధి యోగముకంటె, కామ్యకర్మము లాచరించుట మిక్కిలినీచమైనది. కాబట్టి ఈ బుద్ధియోగమునందే రక్షణను వెదకుము. ఫలముకోరి కర్మలుచేయువారు నిజముగ జాలిపడదగినవారు. అనగా వారిని గూర్చి మహాత్ములు చాల విచారపడుదురు.

* బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్. 50

వివేకముతో కర్మలు చేయువాడు పుణ్యపాపములు రెంటిని ఈ లోకమునందే వదలిపెట్టుచున్నాడు. వానిని అవి బంధించవు. కాన నీవు బుద్ధియోగము కొరకు సిద్ధపడుము. యోగమనగా, కర్మముల నాచరించుచు వానిచే బంధింపబడకుండ మెలగగల నేర్పరితనమే.

* కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మ బంధ వినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్. 51

ఇట్టి నేర్పరితనముతో కూడుకొన్న మహాత్ములు-అనగా సమత్వ బుద్ధి కలిగి కర్మలు చేయువారు- కర్మల వలన కలుగు ఫలములను త్యజించి, జన్మబంధములను త్రెంపుకొని, పునరావృత్తి రహితమైన పరమపదమును పొందుచున్నారు.

* యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. 52

నేను చెప్పిన ప్రకార మాచరించుట వలన నీ బుద్ధి, ఎప్పుడజ్ఞాన రూపమైన మోహమును దాటునో, అప్పుడిహలోక పరలోక సంబంధమైన భోగైశ్వర్యాదులను గురించి, ఇదివరకు వినినవాటి యందును, ఇక వినబోవు వాటియందునుగూడ నీ కసహ్యము కలుగును- అనగా వైరాగ్యము కలుగును

* శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి. 53

అనేకము వినుట చేత చలించినట్టి నీ బుద్ధి ఎప్పుడు ఎడతెగని భగవన్ధ్యానమందు స్థిరమై చలించక నిలచునో, అప్పుడు భగవత్ప్రాప్తి రూపమైన యోగమును పొందగలవు.

అర్జున ఉవాచ :

* స్థితప్రజ్ఞస్య కా భాషా? సమాధి స్థస్య కేశవ !
స్థితధీః కిం ప్రభాషేత? కి మాసీత? వ్రజేత కిమ్ ? 54

అర్జునుడు అడుగుచున్నాడు :

కృష్ణా! అట్లు పరమాత్మప్రాప్తిరూపమైన యోగమునందే స్థిరముగ నిలచిన బుద్ధిగల స్థితప్రజ్ఞునియొక్క పరిస్థితు లెట్లుండును? అతడు ఎట్లు మాట్లాడును? ఎట్లు కూర్చుండును? ఎట్లు నడచును?

శ్రీ భగవానువాచ :

* ప్రజహాతి యదా కామా న్సర్వా న్పార్థ! మనోగతాన్
ఆత్మ న్యేవాత్మనా తుష్ట స్స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. 55

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

అర్జునా! పరమాత్మయందే ఆనందించుచున్నవాడై, చిత్తమునందలి సర్వకాంక్షలను ఎప్పుడు విడుచుచున్నాడో అప్పుడు వాడు స్థితప్రజ్ఞు డనబడుచున్నాడు.

* దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః
వీతరాగభయక్రోధ స్స్థితధీ ర్ముని రుచ్యతే. 56

దుఃఖములు ప్రాప్తించి నప్పటికిని ఎవని చిత్తము కంపింపదో, ఎవనికి సుఖమునందు కాంక్ష లేదో, ఎవనికి ఆసక్తి, భయము, క్రోధము పూర్తిగ నశించిపోయినవో అట్టిముని స్థితప్రజ్ఞు డనబడుచున్నాడు.

* య స్సర్వ త్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 57

ఎవనికి తన దేహాదులు మొదలగు వేనియందును అభిమానము లేదో, తనకు శుభము ప్రాప్తించినను అశుభము ప్రాప్తించినను ఆనందించుట ద్వేషించుట చేయడో వానియొక్క బుద్ధి స్థిరమైనది.

* యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 58

తాబేలు తన అవయవములను ఎట్లు లోపలకు ముడుచుకొనుచున్నదో, అదే విధమున బాహ్యవిషయముల నుండి తన ఇంద్రియములను ఎవడు మరలించుకొనునో వానిబుద్ధి స్థిరమైనది.

* విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. 59

కేవలము నిరాహారులుగ నుండుటచేత ఇంద్రియములు మాత్రము విషయముల ననుభవించుటకు శక్తిలేనివై యుండును. కాని, వాసనలు మాత్రము పోవు. పరమాత్మను తెలిసికొనిన పిమ్మటనే వాసనలు కూడ పూర్తిగ నశించును.

* యతతో హ్యపి కౌంతేయ ! పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః 60

వాసనలు పూర్తిగ నశించకపోవుటచేత, మోక్షము కొరకు యత్నించుచున్నట్టియు, వివేకియు నైన పురుషుని మనస్సును కూడ కలతబెట్టుటయే స్వభావముగాగల ఇంద్రియములు బలాత్కారముగ ఆకర్షించి విషయములలోనికి లాగుచున్నవి.

* తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 61

కాబట్టి సాధకుడు తన ఇంద్రియముల నన్నిటిని వశముచేసికొని, ప్రతినిముసమును తగు జాగ్రత్తతో ఉండి, మత్పరాయణుడై, ధ్యానమగ్నుడుండవలయును. ఎవని ఇంద్రియములు వశమందున్నవో వానిబుద్ధి స్థిరమైనదిగ నున్నది.

* ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. 62

* క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. 63

మానవుడు ప్రాపంచిక విషయములను చింతించుటచేత, వాటియందు ప్రీతికలుగుచున్నది. దానివలన అనుభవించవలయు ననెడి ఆశ కలుగుచున్నది. ఆశకు ఎవ్వరైన అడ్డుతగులు నెడల క్రోధము కలుగుచున్నది. కోపి చేయని పాప మేమున్నదన్నట్లు, కోపమువలన ఇది మంచి, ఇది చెడ్డ అని విచారించుకొను జ్ఞానము మరుగు పడుచున్నది. దానివలన గురుజనులచేత ఇదివరకు బోధింపబడిన సన్మార్గవిషయములు మరపున బడుచున్నవి. మరపువలన బుద్ధి నాశము కలుగుచున్నది. బుద్ధినాశము వలన పరమపురుషార్థమైన పరమాత్మకు దూరుడై అధోగతుల పాలగుచున్నాడు.

* రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి. 64

రాగద్వేష రహితములైనట్టియు, తనకు స్వాధీనములైనట్టియును ఇంద్రియములచేత ప్రపంచమందు సంచరించుచున్నను, స్వాధీన మనస్సుకలవాడు తనస్థితియందే క్షేమముగ ఉండును.

* ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. 65

తనస్థితియందు క్షేమముగ ఉండి, మనశ్శాంతిని పొందియున్న వానియొక్క సర్వదుఃఖములు నశించుచున్నవి. అట్టి పరిశుద్ధాంతఃకరణము కలవారికేగదా బుద్ధి స్థిరమై యుండును !

* నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా
న చాభావయత శ్శాంతి రశాంతస్య కుత స్సుఖమ్ ? 66

ఇంద్రియ నిగ్రహము లేనివారికి పరమాత్మ విషయమై బుద్ధి ఉండదు. ఇంద్రియ నిగ్రహము లేనివారికి పరమాత్మ ధ్యానము కలుగదు. అట్టి ధ్యానము లేనివారికి శాంతియును లేదు. శాంతి లేనివారికి సుఖమెక్కడిది ? అంతయును దుఃఖమే.

* ఇంద్రియాణాం హి చరతాం య న్మనోఽనువిధీయతే
త దస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మి వాంభసి. 67

నిలుకడలేని - అనగా విషయములయందే ప్రవర్తించుచున్న - ఇంద్రియముల ననుసరించుచున్న మనస్సు, సముద్రమందలి ఓడను ప్రతికూలవాయు వెట్లు చెదరగొట్టుచున్నదో, అదేవిధమున సాధకుని బుద్ధిని పాడుచేయుచున్నది.

* తస్మా ద్యస్య మహాబాహో ! నిగృహీతాని సర్వశః
ఇంద్రియా ణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 68

కాబట్టి అర్జునా ! ఎవడు తన ఇంద్రియముల నన్నిటిని విషయముల నుండి మరలించి స్వాధీనమం దుంచుకొనునో, వానియొక్క బుద్ధి మిక్కిలి స్థిరముగ ఉండును.

* యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. 69

సమస్త ప్రాణులును దేనియందు నిద్రింతురో, ముని దానియందే మేల్కొనును. సమస్త ప్రాణులును దేనియందు మేల్కొందురో, ముని దానియందే నిద్రించును. అనగా సమస్త ప్రాణులును పరమాత్మ విషయమందు నిద్రించువారివలె హెచ్చరిక తప్పి

మందమతులై ఉందురు. మునియో అతిజాగరూకుడై, ధ్యాన మగ్నుడై ఉండును. సకల ప్రాణులును విషయములయం దతి జాగరూకులై, ఒక్క క్షణమైనను తీరికలేక యత్నములు చేయు చుందురు. ముని వీటినిగూర్చి వమనాన్నమునువలె అసహ్యించు కొని దూరముగ ఉండును.

* ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్
తద్వ త్కా మాయం ప్రవిశంతి స ర్వే
స శాంతి మాప్నోతి న కామకామీ. 70

నీటిచే పూ ర్తిగ నిండియున్న సముద్రము సూర్యకిరణముల ద్వారమున ఎంత నీరు పోవుచున్నను, నదుల ద్వారమున ఎంత నీరు వచ్చి పడుచున్నను ఎట్లు కలత పొందకుండునో, అట్లే తన దృష్టికి ప్రపంచములోని ఎన్ని విషయములు గోచరించుచున్నను ఎవని చి త్తము కలత పొందదో, అనుభవించవలయు ననెడి కాంక్ష ఈషణ్మాత్రమైనను కలుగదో, అట్టివాడు పరమశాంతిని పొందుచున్నాడు. విషయాస క్తి కలవానికిని శాంతమునకును సంబంధమే లేదు.

* విహాయ కామా న్య స్సర్వా న్పుమాం శ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకార స్స శాంతి మధిగచ్ఛతి. 71

ఏ పురుషుడు సమ స్తమైన కామములను విడచి,ఎంతమాత్రమును వాటియం దభిలాష లేక, అహంకార మమకారములు లేనివాడై ప్రవ ర్తించుచున్నాడో, ఆ పురుషుడు పరమశాంతిని పొందుచున్నాడు.

* ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. 72

ఓ అర్జునా! ఇప్పుడు నీకు చెప్పిన ఈ స్థితి పరమాత్మను పొందుటకు కారణమైనది. ఈ స్థితిని పొందినవాడు మరల మోహమును పొందడు. అంత్యకాలమందు ఈ స్థితి కలిగినను, మానవుడు శాశ్వతానందరూపుడైన పరమాత్మను పొందుచున్నాడు.

ఓం తత్సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే సాంఖ్యయోగో నామ
ద్వితీయోఽధ్యాయః

ఓం శ్రియఃపతయేనమః
ఓం శ్రీ పరమాత్మనేనమః

# శ్రీ గీ తా మృ త ము

## తృతీయాధ్యాయము – కర్మయోగము

అర్జున ఉవాచ :

* జ్యాయసీచే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన !
త త్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ! 1

* వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్. 2

అర్జునుడు అడుగుచున్నాడు :

ఓ జనార్దనా ! కర్మకంటె బుద్ధి – అనగా జ్ఞానము – శ్రేష్ఠమైన దని నీ అభిప్రాయమా ? అట్లైన యెడల ఘోరమైన ఈ కర్మ యందు నన్నేల నియోగించుచున్నావు ? నీవు కలగలుపు వాక్యములతో నా బుద్ధిని భ్రమపెట్టుచున్నట్లున్నావు. నాకు దేనివలన శ్రేయస్సు లభించునో, అట్టి ఒక్కదానిని నిశ్చయించి చెప్పుము.

శ్రీ భ గ వా ను వా చ :

* లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ !
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్. 3

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

ఈ లోకమునందు పూర్వము నాచేత రెండురకములైన అనుష్ఠాన క్రమములు ప్రతిపాదింపబడినవి. అవి సాంఖ్యులకు జ్ఞానయోగము, యోగులకు కర్మయోగమును అయి ఉన్నవి.

* న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి. 4

మానవుడు కర్మలను చేయునంత మాత్రమున నైష్కర్మ్యమును పొందడు. కేవలము కర్మలను స్వరూపముతో కూడ త్యజించుట చేతనే సిద్ధి కలుగదు.

* న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః. 5

ఎవడును కర్మను చేయక ఒక్క క్షణమైనను ఉండలేడు. ఏలయనగా, సర్వులును తమకు ఇష్టమున్నను లేకపోయినను, బలాత్కారముగ ప్రకృతి సంబంధములైన సత్త్వ రజ స్తమోగుణములచేత తప్పక కార్యములందు ప్రవర్తింపజేయబడుచున్నారు.

* కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థా న్విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే. 6

కర్మేంద్రియములను మాత్రము నిగ్రహించి - అనగా కర్మేంద్రియములతో మాత్రము ప్రాపంచికములైన కర్మలేవియును చేయక మనస్సుతో ఎప్పుడును విషయములనే స్మరించుచుండు మూఢుడు, మిథ్యాచారు డని చెప్పబడుచున్నాడు. అనగా ఏకాదశి ఉపవాస ముండి, మనసులో మాత్రము "ఎప్పుడీరోజు గడచును, ఎప్పుడు తెల్లవారును, ఎప్పుడు సకలమైన పదార్థములను చేసికొని కడుపు నిండ భుజింతుము" అనుచు, పరమాత్మను భజించుట వదలిపెట్టి ఆహారపదార్థములనే భజించుట మొదలగునవి మిథ్యాచారుని లక్షణములు.

* య స్త్వింద్రియాణి మనసా నియ మ్యారభతేఽర్జున !
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే. 7

ఎవడు మనస్సుచే ఇంద్రియములను నియమించి, వశమం దుంచుకొని, ఆసక్తి లేనివాడై, కర్మేంద్రియములచే కర్మయోగ మాచరించుచున్నాడో వాడు శ్రేష్ఠుడు సుమా!

* నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః. 8

శాస్త్రములలో నీ వర్ణాశ్రమములకు నియమింపబడిన నిత్యనైమిత్తికాది కర్తవ్య కర్మలను చేయుము. కర్మలను చేయకుండుట కంటె, చేయుట శ్రేయస్కరము. కర్మలను చేయని యెడల నీశరీరయాత్ర కూడ కొనసాగదు.

* యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగ స్సమాచర. 9

యజ్ఞార్థము చేయు కర్మలుగాక, ఇతరమైన కర్మలచేతనే మానవలోక మంతయు బంధింపబడుచున్నది. కాబట్టి అర్జునా! ఆసక్తిని వదలి యజ్ఞముకొరకు - అనగా ధర్మసంస్థాపనము కొరకు - నీ కర్తవ్య కర్మలు చేయుము.

* సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్ట కామధుక్. 10

బ్రహ్మదేవుడు పూర్వము యజ్ఞములతో సహా ప్రజలను సృజించి, వారితో నిట్లు చెప్పెను- "మీరందరును ఈ యజ్ఞముల ద్వారమున వృద్ధిగాంచుడు. ఈ యజ్ఞములు మీ మీ మనోరథ భోగముల నిచ్చును.

* దేవా న్భావయ తానేన తే దేవా భావయంతు వః
పరస్పరం భావయంత శ్శ్రేయః పర మవాప్స్యథ. 11

"మీరు యజ్ఞములచేత దేవతలను గౌరవించుడు. దేవతలు మిమ్ము వృద్ధిబొందింతురు. ఈ విధముగ మీరు పరస్పరము సహాయము చేసికొనుచు, ఉత్కృష్టమైన శ్రేయమును పొందుడు"

* ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః 12

యజ్ఞములచేత దేవతల నారాధించిన యెడల, వారు అభీష్టములైన భోగముల నిత్తురుగదా! వారిచేత ఈయబడి భోగములను వారలకు సమర్పింపకయే అనుభవించువాడు చోరు డనబడుచున్నాడు.

* యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః
భుంజతే తే త్వఘం పాపా యే పచం త్యాత్మకారణాత్. 13

యజ్ఞముల ద్వారమున దేవతల నారాధించి, అమృతమనబడు ఆ శేషమును భుజించునట్టి సత్పురుషులు సమస్త పాపములనుండి విడువబడుచున్నారు. కేవలము తమ పొట్ట నింపుకొను నిమిత్తమే వండుకొని తిను పాపాత్ములు పాపమును భుజించుచున్నారు. వారు భుజించునది అన్నరూపమైన పాపమే అని భావము.

* అన్నాద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః. 14

* కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. 15

అన్నము వలన సమస్త భూతములును కలుగుచున్నవి. వర్షము కురియుటవలన అన్నము కలుగుచున్నది. యజ్ఞము చేయుటచేత వర్షము కలుగుచున్నది. యజ్ఞము సత్కర్మాచరణము వలన

కలుగుచున్నది. కర్మము ప్రకృతివలన కలుగుచున్నది. ప్రకృతి పరమాత్మనుండి బయలువెడలుచున్నదని తెలిసికొనవలెను. కాబట్టి సర్వవ్యాపకుడైన పరమాత్మ యజ్ఞములలో ఎప్పుడును ప్రతిష్ఠితుడై యున్నాడు.

* ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయ తీహ యః
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ సజీవతి. 16

ఈ విధముగ పరమాత్మచేత ఏర్పరుపబడిన సృష్టిచక్రమును ఎవడు అనుసరింపడో-అనగా తనకర్తవ్యపాలనము చేయడో, వానియొక్క ఆయువు పాపములతో నిండియున్నది. అట్టి ఇంద్రియలోలుని బ్రతుకు వ్యర్థము.

* య స్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే. 17

* నైవ తస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః. 18

కాని, సర్వకాల సర్వావస్థలయందును పరమాత్మయందే ఆసక్తి కలిగి, పరమాత్మయందే తృప్తులై, పరమాత్మయందే ఆనందించుచుండు మహాత్ములకు కర్తవ్య మని చేయదగిన దేదియును లేదు. ఏలయనగా, వారు కృతకృత్యులు. అట్టి మహాత్ములకు ఈ లోకమునందు కర్మచేయుటచే వచ్చు లాభముగాని, చేయకపోవుటచే వచ్చు నష్టముగాని ఏమాత్రమును లేదు. వారికి పిపీలికము మొదలు బ్రహ్మపర్యంతము సకల భూతములయందును తా మాశ్రయించి సంపాదింపవలసిన పదార్థ మొకటియును లేదు-వారు కాంక్షారహితులు గనుక.

* తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర !
అసక్తో హ్యాచర న్కర్మ పర మాప్నోతి పూరుషః. 19

నీవు మాత్రము ఫలాపేక్ష లేక, ఎప్పుడును కర్మల నాచరింపుము. ఫలాపేక్ష లేక కర్మలు చేయుచున్న మానవుడు చిత్తశుద్ధి కలవాడై క్రమముగ మోక్షమును పొందుచున్నాడు.

* కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః
లోకసంగ్రహ మేవాపి సంపశ్య న్కర్తు మర్హసి. 20

ఈ విధముగ జనకుడు మొదలైనవారు నిష్కామకర్మ చేతనే గదా సిద్ధి పొందిరి ! కనుక లోకసంగ్రహము నూహించియైనను నీవు కర్మ చేయువలసియున్నది.

* య ద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః
స య త్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే. 21

శ్రేష్ఠులైనవా రేమి ఆచరించెదరో, దానినే లోకులు కూడ ఆచరించెదరు. ఆ శ్రేష్ఠులు దేనిని ప్రమాణముగ అంగీకరింతురో, దానినే లోకమంతయు అనుసరించును.

* న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి. 22

* యది హ్యహం నవర్తేయం జాతు కర్మ ణ్యతంద్రితః
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. 23

* ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మచే దహమ్
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః. 24

ఓ అర్జునా ! నాకు చేయదగిన కర్తవ్య మేమియును లేదు. ఐనను, అట్టి అవాప్తసమస్తకాముడ నగు నేను కూడ కర్మలు

చేయుచున్నాను గదా! నేనే ప్రాలుమాలి కర్మలు చేయక పోతినేని మానవు లన్నివిధముల న న్ననుసరించి, వారివారి కర్తవ్యములు మానినవారై చెడిపోవుదురు. నేను నా చేతు లార వర్ణ సంకరము చేసినవాడను, ప్రజలను చెడగొట్టినవాడను అగుదును.

* సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత!
కుర్యా ద్విద్వాం స్తథాస క్త శ్చికీర్షు ర్లోక సంగ్రహమ్. 25

ఓ అర్జునా! అజ్ఞానులైన ప్రజ లెట్లు ఫలాపేక్షతో కర్మలు చేయుచున్నారో, అదే విధమున ఫలాపేక్ష లేక విద్వాంసుడు కూడ తనమేలును, లోకముయొక్క మేలును కోరి కర్మలు చేయవలయును.

* న బుద్ధిభేదం జనయే దజ్ఞానాంకర్మసంగినామ్
జోషయే త్సర్వకర్మాణి విద్వా న్యుక్త స్సమాచరన్. 26

విద్వాంసుడైనవాడు, కర్మలయం దాసక్తి కలిగిన అజ్ఞానుల యొక్క బుద్ధిలో చలనము కలిగించరాదు. నేర్పరితనముతో తాను చేయుచు, సమస్త కర్మలను బంధనములో పడకుండ ఆచరించుట వారికి గూడ నేర్పవలెను.

* ప్రకృతి క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే. 27

ప్రకృతిగుణములచేత అనేక విధములుగ చేయబడుచున్న కర్మలను గురించి, అహంకారయుక్తుడైన అజ్ఞాని 'నేను చేయుచున్నాను' అనుచు, కర్తృత్వమును తనపై వేసికొనుచున్నాడు.

* తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మ విభాగయోః
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే.

అర్జునా ! గుణకర్మ విభాగముల యొక్క యథార్థ తత్త్వమును తెలిసినవాడు సత్త్వాది గుణములు తమ తమ కార్యములందు ప్రవర్తించుచున్నవని తలచి, తాను కర్తనను అభిమానము వదలియుండును.

* ప్రకృతే ర్గుణసమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు
తా నకృత్స్నవిదో మందా న్కృత్స్నవి న్నవిచాలయేత్. 29

ప్రకృతియొక్క సత్త్వరజస్తమోగుణములచేత మోహింపజేయబడిన వారై, గుణకర్మములయందు 'నేను కర్త'నను అభిమానముంచునట్టి అట్టి జ్ఞానహీనులైన వారిని, తత్త్వము తెలిసినవారు బుద్ధిచలనమును కలుగజేసి, కర్మభ్రష్టులుగ చేయరాదు.

* మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః 30

అర్జునా ! నీవు భగవదర్పణబుద్ధితో సర్వకర్మలను నాయందు సమర్పించి, ఫలాపేక్షలేక, అహంకారమును విసుగును వదలి యుద్ధము చేయుము.

* యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః. 31

నా ఈ ఉపదేశమును విశ్వాసముకలిగి, శ్రద్ధావంతులై, అసూయ లేక, ఎల్లప్పుడును ఎవరాచరించుచున్నారో, వారుకూడ కర్మబంధముల నుండి విడువబడుచున్నారు.

* యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్
సర్వజ్ఞాన విమూఢాం స్తాన్విద్ధి నష్టా న చేతసః. 32

కాని నా ఈ ఉపదేశమును ద్వేషబుద్ధిగలవారై, ఎవరాచరింపరో వారిని అజ్ఞానులనియును, విపరీతజ్ఞానము కలవారనియును, అన్నివిధముల చెడినవా రనియును తెలిసికొనుము.

* సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవా నపి
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ? 33

జ్ఞానవంతుడైనను తన పూర్వజన్మ వాసనానుకూలముగనే లోకమందు ప్రవర్తించుచున్నాడు. సకల ప్రాణులును తమతమ ప్రకృతినే - అనగా స్వభావమునే - అనుసరించుచున్నవి. అట్లు వాసనలనే అంటిపెట్టుకొని నడచువారిని శాస్త్రజన్యజ్ఞానమేమి చేయగలదు ? శాస్త్రనిగ్రహము ఏమి ఆపగలదు ?

* ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయో ర్నవశ మాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ. 34

ప్రతి ఇంద్రియు భోగమునందును రాగద్వేషములు రెండును దాగియున్నవి. తనకిష్టమైనది అనుభవించునప్పుడు ప్రీతియు, అనిష్టమైనది లభించునప్పుడు ద్వేషమును కలుగుచుండును. సాధకు డీ రెంటికిని వశపడకూడదు. ఎందులకనగా, సాధకునకు ఈ రెండును శత్రువులై యున్నవి.

* శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 35

పరధర్మము చక్కగ - అనగా సుఖకరముగ - ఆచరించుటకు వీలైనను, దానికంటె దోషసహితమైనను తన వర్ణమునకును ఆశ్రమమునకును నియమింపబడిన స్వధర్మమే మిక్కిలి శ్రేయస్కరమైనది. తన ధర్మమందు మరణించినను శ్రేయస్సే కలుగును. కాని, పరధర్మము భయమును కలిగించునదియై యున్నది.

అర్జున ఉవాచ :

* అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ ! బలా దివ నియోజితః. 36

అర్జునుడు అడుగుచున్నాడు :

కృష్ణా! అట్లైన యెడల, మానవుడు ఇష్టమున్నను లేకపోయినను, దేనిచేత ప్రేరేపింపబడి బలవంతముగ చేయించినట్లు పాపమును చేయుచున్నాడో చెప్పుము.

శ్రీ భగవానువాచ :

* కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్. 37

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

దీనికి కారణము రజోగుణమువలన కలిగిన కామమే. ఇది విషయము లెంత కాల మనుభవించినను తృప్తిపొందనిది. ఈ కామమే క్రోధరూపముగ పరిణమించుచున్నది. అనేక మహాపాపములకు కారణమైనది. ఇది మోక్షమార్గమందు ప్రవర్తించు వారికి ప్రబలమైన శత్రువని తెలిసికొనుము.

* ధూమే నావ్రియతే వహ్ని ర్యథాదర్శో మలేన చ
యథోల్బే నావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్. 38

పొగచేత అగ్నియు, దుమ్ముచేత అద్దమును కప్పబడినట్లును, మావిచేత గర్భ మావరింపబడినట్లును ఈ సమస్త ప్రాణి లోకమును ఈ కామముచేత ఆవరింపబడి యున్నది.

* ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ ! దుష్పూరే ణానలేన చ. 39

ఓ అర్జునా ! జ్ఞానులకెల్లప్పుడును వైరిరూపమైనదియును, తృప్తి పరచుటకు శక్యము కానిదియును ఐన కామరూపమగు అగ్నిచేత మానవుని జ్ఞానము కప్పబడి మరుగుబడియున్నది.

* ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్. 40

ఈ కామమునకు ఇంద్రియములును, మనస్సును, బుద్ధియును ఆశ్రియములై యున్నవి. వీనియొక్క ఆశ్రియముచేత ఈ కామము జ్ఞానమును కప్పియుంచి దేహిని - అనగా ఆత్మను - మోహింప జేయుచున్నది.

* తస్మా త్త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ !
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్. 41

కాబట్టి అర్జునా! నీవు ముందు ఇంద్రియములను జయించి వశము చేసికొని, తరువాత జ్ఞానవిజ్ఞానములు రెంటిని నశింపజేసెడి మహా పాపకారణమైన కామమును సమూలముగ నశింపజేయుము

* ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః
మనస స్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరత స్తు సః. 42

దేహముకంటె ఇంద్రియములు శ్రేష్ఠములు. ఇంద్రియముల కంటె శ్రేష్ఠమైనది మనస్సు. మనస్సుకంటె బుద్ధి శ్రేష్ఠమైనది. బుద్ధికంటె బలమైనది కామము.

* ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సం స్త భ్యాత్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో ! కామరూపం దురాసదమ్. 43

ఈ విధముగ బుద్ధికంటెను బలమైన కామమును తెలి! సాధనల నారితేరిన నిశ్చయాత్మకమైన బుద్ధిచేత మన వశమందుంచుకొని, నిగ్రహించుటకు కష్టమైన ఈ కామ శత్రువును సర్వవిధ ప్రయత్నములచేతను నశింపజేయుము

ఓం తత్ సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మయోగో నామ
తృతీయోఽధ్యాయః

ఓం శ్రియఃపతయేనమః
ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీ గీ తా మృ త ము

## చతుర్థాధ్యాయము — జ్ఞానయోగము

శ్రీ భ గ వా ను వా చ :

* ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్
వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్. 1

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

నాశరహితమైన ఈ యోగమును, నేను పూర్వమందు సూర్యునకు చెప్పితిని. సూర్యుడు తన కుమారుడగు మనువునకు చెప్పెను. ఆమనువు తన కుమారుడైన ఇక్ష్వాకు మహారాజునకు చెప్పెను.

* ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప ! 2

శత్రువులను తపింపజేయు ఓ అర్జునా! ఈ విధముగ పరంపరాగతమైన ఈ యోగమును రాజర్షులు తెలిసికొనిరి. కాని, చాలకాలము గడచిపోవుటచే ఈ యోగము ఈలోకమందు నష్టమైపోయినది.

* స ఏ వాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్. 3

నీవు నా భక్తుడవును ప్రియమిత్రుడవును కనుక, బహుపురాతనమైన ఈ యోగమునే నేడు నేను నీకు చెప్పుచున్నాను. ఉత్తమమైన ఈ యోగము చాల గోప్యముగ ఉంచదగినది సుమా!

అ ర్జు న ఉ వా చ :

* అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి. 4

అర్జునుడు అడుగుచున్నాడు :

కృష్ణా ! నీవు ఈ నడుమ పుట్టినవాడవు. సూర్యుని పుట్టుక నీకంటె ఎంతో ముందు జరిగినది. నీవే సూర్యునికి చెప్పితివి అను మాట నమ్ముట ఎట్లు ?

శ్రీ భగవానువాచ :

* బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున !
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ! 5

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

ఓ అర్జునా ! నీకును నాకును కూడ అసంఖ్యాకము లైన జన్మలు గడచిపోయినవి. వాటి నన్నిటిని నే నెరుగుదునుగాని, నీ వెరుగవు.

* అజోఽపి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా. 6

నేను పుట్టుక లేనివాడను, నాశరహితుడను, సర్వభూతములకును ఈశ్వరుడను, ఐనప్పటికిని, నా యొక్క ప్రకృతిని స్వాధీనము చేసికొని, నా యొక్క మాయచేత పుట్టుచున్నాను. అనగా నా పుట్టుక లోకుల పుట్టుకలవలె కర్మాధీనము కాదు; స్వేచ్ఛా పూర్వకమైనదని తెలిసికొనుము.

* యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్. 7

అయితే, కర్మచేత నేగదా జన్మలు వచ్చినవి; అట్టి కర్మకు నీ వధీనుడవు కానప్పుడు పుట్టవలసిన పని ఏమున్నదందువా, చెప్పెదను వినుము - ఎప్పు డెప్పుడు ధర్మమునకు హాని చేకూరునో, అధర్మమున కభివృద్ధి కలుగునో అప్పుడే స్వేచ్ఛాపూర్వకమైన ఒక దివ్యమంగళ స్వరూపమును ధరించి ప్రకట మయ్యెదను.

* పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. 8

సాధువులను రక్షించుటకును, దుర్మార్గులను నశింపజేయుటకును, ధర్మమును పునరుద్ధరించుటకును ప్రతియుగమునందును అవతరించు చుందును.

* జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున! 9

అర్జునా! నాయొక్క దివ్యమైన - అనగా నిర్మలము, అప్రాకృతము నైన - జన్మను, కర్మను - అనగా నా అవతారమును - సాధుసంత్రాణము మొదలగు లీలలను, - యథార్థముగ ఎవడు తెలిసికొనుచున్నాడో, వా డీ దేహమును త్యజించిన తరువాత మరల జననమరణ రూపమైన సంసారమును రాడు; నన్నే పొందుచున్నాడు.

* వీతరాగ భయక్రోధా మన్మయా మాముపాశ్రితాః
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః. 10

ప్రాపంచిక విషయములయందు ప్రీతిలేక, భయమును కోపమును జయించి, నన్నాశ్రయించి, నాయందే చిత్తముగల అనేకమంది సాధుపుంగవులు నా అవతారముల యొక్కయు, లీలల యొక్కయు రహస్యములను తెలిసికొనుట అనెడి జ్ఞానతపస్సుచే పవిత్రులై, పునరావృత్తిరహితమైన మోక్షమును పొందిరి.

* యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. 11

ఎవరెవరు నన్ను ఎట్లెట్లు భజింతురో వారివారికి వారివారి భావానుకూలముగనే అనుగ్రహించెదను. కాబట్టి ఏదోవిధమున మానవు

లందరును నన్నే అనుసరించుచున్నారు. వారివారి భావాను కూలములైన ఫలములను, వారి వారి విశ్వాసములకు తగినంత పొందుచున్నారు.

* కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా. 12

ఈ లోకమున మానవులు కర్మలయొక్క సిద్ధినికోరి, ఫలాపేక్షతో ఇంద్రాది దేవతలను ఆరాధించుచున్నారు. కారణమేమనగా, మానవలోకమునందు కర్మఫలము శీఘ్రముగ దొరకుచున్నది. అనగా రాగద్వేషాది గుణముల జయించుట మొదలగు శ్రమ అక్కరలేకయే స్వర్గాది అనిత్యఫలములు దొరకుటచే జనులు దానిచే మోహింపబడి కర్మలద్వారమున ఇంద్రాది దేవతలను పూజించుచున్నారు.

* చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. 13

బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను ఈ నాలుగు వర్ణములను వారివారి గుణకర్మముల విభాగమును బట్టి నేనే సృష్టించితిని. ఈ విధముగ సృష్టిని నేనే చేయుచున్నప్పటికిని, వాస్తవ మాలోచించిన నాశములేని నన్ను అకర్తనుగ తెలిసికొనుము.

* న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే. 14

నన్నీసృష్ట్యాది కర్మలు బంధింపవు. ఏలయన, నాకీ కర్మఫలమం దెట్టి ఇచ్ఛయునులేదు. నన్నీ ప్రకారముగ ఎవడు తెలిసికొను చున్నాడో వాడుకూడ కర్మలచే బంధింపబడడు.

* ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. 15

పూర్వకాలమందలి ముముక్షువులుకూడ, ఈ రీతిగ తెలిసికొని కర్మ చేసియున్నారు. కాబట్టి పూర్వులచేత ఆచరింపబడినదియును, బహుపురాతన మైనదియును అగు కర్మనే నీవుకూడ చేయుము.

* కిం కర్మ కి మకర్మేతి కవయో౽ప్యత్ర మోహితాః
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసే౽శుభాత్. 16

ఏది కర్మ ? ఏది అకర్మ ? - ఈ విషయము నిర్ణయించుకొనుటకో పండితులు సైతము పొరపడుచున్నారు. కాబట్టి దేనిని తెలిసికొనిన ఈ సంసారబాధనరూపమైన అశుభమునుండి విముక్తి పొందగలవో, అట్టి కర్మాకర్మలయొక్క తత్త్వమును చెప్పుచున్నాను వినుము.

* కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. 17

కర్మ అనగా ఏమో తెలియవలయును. అకర్మ అనగా ఏమో, వికర్మ అనగా ఏమో తెలియవలయును. కర్మాకర్మవికర్మలయొక్క స్వరూపము తెలియుట చాల కష్టమైనది.

* కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. 18

కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను ఎవడు చూచునో వాడే మానవులందరిలో తెలివిగలవాడు; వాడే యోగి. వాడు సమస్త కర్మలను ఆచరించినవాడగుచున్నాడు.

* యస్య సర్వే సమారంభాః కామ సంకల్ప వర్జితాః
జ్ఞానాగ్నిదగ్ధ కర్మాణం త మాహుః పండితం బుధాః. 19

ఎవడు తాను ప్రారంభించిన కర్మలన్నియును, ఇహలోక పరలోక భోగములం దపేక్షలేకను, కర్తృత్వమును తనమీద వేసికొనుట చేత కలిగిన 'నేను చేయుచున్నాను' అను అహంకారరూపమైన సంకల్పము లేకను చేయునో, అట్టివాని సంచిత ఆగామి కర్మలన్నియును జ్ఞానమను అగ్నిచే దహింపబడుచున్నవి. అట్టివానిని జ్ఞానులు 'పండితుడు' అని చెప్పుదురు.

* త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మ ణ్యభిప్రవృత్తో౽పి నైవ కించి త్కరోతి సః. 20

కర్మఫలమునం దాసక్తి ఏమాత్రమును లేక నిత్యవస్తువైన పరమాత్మయం దెల్లప్పుడును తృప్తికలిగి, అస్థిరమైన సంసారమం దాశ్రయబుద్ధిలేక ఉండువాడు కర్మలయందు బాగుగ ప్రవర్తించుచున్నను, ఏమియును చేయనివాడే అగుచున్నాడు.

* నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. 21

కోరికలు లేనివాడును, ఇంద్రియములను, మనస్సును, శరీరమును గూడ పూర్తిగ స్వాధీనమం దుంచుకొనినవాడును, సర్వభోగోపకరణములను సంపాదించుట వదలినవాడును ఐన యోగి, కేవలము శరీరముతో కర్మలు చేయుచున్నను వానికి బంధము కలుగదు.

* యదృచ్ఛా లాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమ స్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే. 22

తన ప్రయత్నము లేకయే, ప్రారబ్ధకర్మానుసారము లభించిన దానితో తృప్తి పొంది, లాభనష్టములు, రాగద్వేషములు

మొదలైన ద్వంద్వముల కతీతుడై, - అనగా ద్వంద్వములు లేనివాడై, అసూయ లేనివాడై, లభించినను లభించకపోయినను సమముగ ఉండువాడు కర్మలు చేసియును బంధింపబడడు.

* గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః
యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. 23

పరమాత్మకంటె ఇతరమైన విషయములయం దాసక్తి లేని వాడును, రాగద్వేషములనుండి విడువబడినవాడును, భగవ ద్విషయ జ్ఞానమందు చిత్తము నిలిచియున్నవాడును, కేవలము యజ్ఞముకొరకే కర్మ చేయువాడును అగు మానవుని సమస్త కర్మలును నశించుచున్నవి - అనగా బంధించక శక్తిహీనము లగుచున్నవి.

* బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మ కర్మ సమాధినా. 24

యజ్ఞమందు సమర్పింపబడు స్రుగాది హోమసాధనములు బ్రహ్మము. హోమద్రవ్యములు బ్రహ్మము. బ్రహ్మరూపమైన అగ్నియందు, బ్రహ్మయగు కర్తచేత చేయబడు హోమము బ్రహ్మము. ఈవిధముగ దృఢనిశ్చయము కలిగి, బ్రహ్మాత్మకమైన కర్మయందు, సర్వము బ్రహ్మాత్మకముగ అనుసంధానము చేయువానిచేత పొందదగిన ఫలము బ్రహ్మమే.

* దైవ మే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి. 25

కొందరు కర్మనిష్ఠులు దేవతల నుద్దేశించి చేయబడు యజ్ఞమునే ప్రధానముగ అనుష్ఠించుచున్నారు. మరికొందరు బ్రహ్మరూపమైన అగ్నియందు యజ్ఞముచేతనే యజ్ఞము చేయుచున్నారు.

* శ్రోత్రాదీనింద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీన్విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి. 26

మరికొందరు శ్రోత్రాదీంద్రియములను, నిగ్రహించుట అనెడి అగ్నియందు హోమము చేయుచున్నారు. మరికొందరు శబ్దాది విషయములను ఇంద్రియము లనెడి అగ్నియందు హోమము చేయుచున్నారు.

* సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణ కర్మాణి చాపరే
ఆత్మసంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే. 27

మరికొందరు సమస్తేంద్రియముల యొక్క కర్మలను, పంచప్రాణముల యొక్క కర్మలను జ్ఞానము చేత ప్రకాశింపజేయబడిన మనోనిగ్రహ మనెడి అగ్నియందు హోమము చేయుచున్నారు.

* ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః. 28

గట్టి పూనికయు, దృఢసంకల్పమును కలిగి, కొందరు ద్రవ్యసంబంధమైన యజ్ఞములు చేయుదురు. కొందరు తపోరూపములైన యజ్ఞములును, కొందరు ప్రాణాయామాది యోగరూపములైన యజ్ఞములును, కొందరు వేదాంత గ్రంథములను చదువుటయు, దాని అర్థవిచారణ చేయుటయు అను యజ్ఞములును చేయుదురు.

* అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః. 29

* అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః. 30

ప్రాణాయామమందు దాసక్తిగల కొందరు ఆహార నియమముకలిగి, అపానవాయువునందు ప్రాణవాయువును హోమము చేయుచున్నారు. కొందరు ప్రాణవాయువునం దపానవాయువును హోమము చేయుచున్నారు. కొందరు ప్రాణవాయువుయొక్కయు, అపానవాయువుయొక్కయు, సంచారమును నిలిపి, ప్రాణములను ప్రాణములయందు హోమము చేయుచున్నారు. వీరందరునుకూడ యజ్ఞములను తెలిసినవారును, యజ్ఞముచేత పాపములు నశించిన వారును అయి ఉన్నారు.

* యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్
నాయం లోకో౽స్త్యయజ్ఞస్య కుతో౽న్యః కురు సత్తమ! 31

వీరందరును యజ్ఞము చేయగా మిగిలిన 'అమృతము' అనబడు అన్నమును భుజించువారగుటచే, శాశ్వతబ్రహ్మమును పొందు చున్నారు. వీటిలో ఒక యజ్ఞమైనను చేయనివారికి ఈ లోకమే లేదు. ఇంక పరలోక మెక్కడిది ? అట్టివారు రెండు లోకము లకును చెడుచున్నారు.

* ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే
కర్మజా న్విద్ధి తా న్సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. 32

ఈ విధముగ అనేకములైన యజ్ఞములు వేదములందు విస్తరించి చెప్పబడియున్నవి. ఈ యజ్ఞములన్నియును కర్మలచేత కలిగి నవిగా తెలియుము. ఈ విధముగ తెలిసికొనిన సంసారబంధము నుండి విడివడగలవు.

* శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప !
సర్వం కర్మాఖిలం పార్థ ! జ్ఞానే పరిసమాప్యతే. 33

ఓ అర్జునా ! ద్రవ్యముతో జరుగవలసిన యజ్ఞముకంటె జ్ఞాన యజ్ఞము శ్రేష్ఠమైనది. అన్నివిధములైన కర్మలును జ్ఞానమందు ముగియుచున్నవి.

* తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. 34

* యద్ జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాండవ !
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి. 35

అట్టి జ్ఞానమును నీవు జ్ఞానసంపన్నులైనట్టియు, పరమాత్మ సాక్షాత్కారము పొందినట్టియును మహాత్ముల సన్నిధికిపోయి, సాష్టాంగ నమస్కారములచేతను, ప్రశ్నలు వేయుటచేతను, సేవచేతను తెలిసికొనుము. ఆ విధముగా అడిగిన యెడల నీ భక్తి వినయములకు సంతోషించి, మహాత్ములు నీ కా జ్ఞానమును ఉపదేశింతురు. ఆ జ్ఞానమును పొందిన తరువాత నీవు మరల ఇట్టి మోహమును పొందవు. దానిచేత సమస్త భూతములను నీయందును, అట్లే నాయందును చూడగలవు.

* అపి చే దసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి. 36

నీవు పాపాత్ము లందరికంటెనుకూడ మిక్కిలి పాపము చేసినవాడవైనను, ఈ జ్ఞానమను నావచేతనే అగాధమైన పాప సముద్రమును దాటగలవు.

* యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున !
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా. 37

బాగుగ ప్రజ్వలించి మండుచున్న అగ్నికట్టెలను కాల్చి భస్మము

చేయునట్లే, ఈ జ్ఞానాగ్నియు సమస్త కర్మలను భస్మము చేయుచున్నది.

* నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి. 38

జ్ఞానమంత పవిత్రమైన దీ లోకమున ఇంకొకటి లేదు. నిష్కామ బుద్ధితో కర్మయోగమును ఆచరించి సిద్ధిపొందినవాడు కాల క్రమమున తానే ఈ జ్ఞానమును పొందుచున్నాడు.

* శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి. 39

గురువులయొక్కయు, శాస్త్రములయొక్కయు ఉపదేశములందు శ్రద్ధకలవాడును, జ్ఞానమందే ఆసక్తి కలవాడును, ఇంద్రియము లను జయించినవాడును అయిన సాధకుడు ఆ జ్ఞానమును పొందు చున్నాడు. జ్ఞానమును పొందుటచేత ఉత్కృష్టమైన శాంతిని శీఘ్రముగ పొందుచున్నాడు.

* అజ్ఞ శ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః. 40

మహాత్ములవద్ద కేగి ఉపదేశము పొందని అజ్ఞానియు, ఉపదేశమును పొందినను దానియందు శ్రద్ధలేనివాడును, శాస్త్ర వాక్యములందును, గురువాక్యములందును నమ్మకము లేనివాడును చెడిపోవుచున్నాడు. సంశయాత్మునకు ఈ లోకమును పరలోక మునుకూడ లేవు. కాబట్టి వానికి సుఖమును లేదు.

* యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్న సంశయమ్
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ ! 41

కర్మయోగ విధానమున సమస్త కర్మలను పరమాత్మయందు సమర్పించినవాడును, జ్ఞానమనెడి ఖడ్గముచే సంశయములను తెగనరికినవాడును అగు ప్రశాంతచిత్తుని, కర్మలు బాధించవు.

* తస్మా దజ్ఞాన సంభూతం హృత్థ్సం జ్ఞానాసి నాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత ! 42

కాబట్టి ఓ అర్జునా ! అజ్ఞానముచేత కలిగి, నీ హృదయమున బాగుగ నాటియున్న ఈ సంశయమును - అనగా మోహమును - జ్ఞానమనెడి ఖడ్గముచే ఖండించి, నేనింతవరకును నీకొరకు ఉపదేశించిన కర్మయోగమును ఆచరింపుము. యుద్ధమునకు సిద్ధమై లెమ్ము !

ఓం తత్ సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సుపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే జ్ఞానయోగోనామ
చతుర్థోఽధ్యాయః

ఓం శ్రియఃపతయేనమః
ఓం శ్రీ పరమాత్మనేనమః

# శ్రీ గీతామృతము

## పంచమాధ్యాయము — కర్మసన్న్యాసయోగము

అర్జున ఉవాచ :

* సన్న్యాసం కర్మణాం కృష్ణ! పున ర్యోగం చ శంససి
యచ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్. 1

అర్జునుడు అడుగుచున్నాడు :

కృష్ణా! నీవు కర్మసన్న్యాసమును, కర్మయోగమునుకూడ ప్రశంసించుచున్నావు ఈ రెంటిలో ఏ ఒక్కదానిచే నాకు శ్రేయస్సు నిశ్చితమైయున్నదో దానిని చెప్పుము.

శ్రీ భగవానువాచ :

* సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ
తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే. 2

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

కర్మసన్న్యాసమును, కర్మయోగమును- రెండును కూడ మోక్షదాయకములే. ఆ రెంటిలో కర్మసన్న్యాసము కంటె కర్మయోగమే శ్రేష్ఠమైనది.

* జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి
నిర్ద్వంద్వోహి మహాబాహో! సుఖం బంధా త్ప్రముచ్యతే. 3

ఓ అర్జునా! ద్వేషరహితుడు, కోరికలు లేనివాడు, సుఖదుఃఖాది ద్వంద్వములు లేనివాడు నిత్యసన్న్యాసి అని తెలిసికొనుము. వాడు సుఖముగ బంధమునుండి విడివడుచున్నాడు.

* సాంఖ్యయోగౌ పృథ గ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏకమ ప్యాస్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలమ్. 4

కర్మసన్న్యాసమును, కర్మయోగమును వేరువేరని అజ్ఞానులు తలతురు. పండితులు అట్లు చెప్పరు. పైకి రూపములు వేరు వేరుగ ఉన్నను, ఫలముమాత్ర మొక్కటే. కనుక నే, ఈ రెంటిలో దేనినైనను బాగుగ అనుష్ఠించినవాడు మోక్షఫలమును పొందు చున్నాడు.

* యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి. 5

సన్న్యాసులు పొందెడి మోక్షమును కర్మయోగులు కూడ క్రమముగ పొందగలరు. సన్న్యాసము, కర్మయోగముకు డ మోక్షమును పొందుటకు ఒక్కటే యని తెలిసికొనినవాడే యథార్థమును తెలిసికొనినవాడు.

* సన్న్యాసస్తు మహాబాహో ! దుఃఖమాప్తుమయోగతః
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి. 6

కర్మయోగముచే అంతఃకరణపరిశుద్ధికలిగి, సమస్తేంద్రియము లను, చిత్తమును బాగుగ వశమందుంచుకొనిన తరువాతగాని, సన్న్యాసమున కధికారము లేదు. ముందు భ్రాంతిచేత సన్న్యాసము నాశ్రయించిన యెడల, దానిచేత దుఃఖమేగాని సుఖము లేదు. కాబట్టి, కర్మయోగముతో కూడినవాడై, అంతఃకరణ పరిశుద్ధి కలిగిన ముని శీఘ్రముగ పరమాత్మను పొందుచున్నాడు.

* యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. 7

నిష్కామముగ కర్మయోగ మాచరించుటచే పరిశుద్ధమైనట్టియు, స్వాధీనమైనట్టియు అంతఃకరణము కలవాడును, ఇంద్రియములను

జయించినవాడును, సర్వభూతములకును ఆత్మభూతమైన పరమాత్మ కలవాడును - అనగా పరమాత్మను పొందినవాడును- అయిన మహాత్ముడు లోకకల్యాణార్థము కర్మ చేయుచున్నను, ఆ కర్మ వానిని బంధించలేదు. అంతేకాక లోకమునకు మిక్కిలి మేలుకూడ చేకూర్చును.

* నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శ్రుణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్. 8

* ప్రలపన్విసృజన్గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. 9

ఓ అర్జునా! యథార్థతత్త్వము తెలిసినవాడు కన్నులతో చూచుచున్నను, చెవులతో వినుచున్నను, తాకుచున్నను, వాసనచూచుచున్నను, తినుచున్నను, నడచుచున్నను, నిద్రించుచున్నను, ఊపిరి విడుచుచున్నను, మాట్లాడుచున్నను, మల మూత్ర విసర్జనములు చేయుచున్నను, ఏ వస్తువులనైనను చేతులతో గ్రహించుచున్నను, కనులు తెరుచుట, మూయుట చేయుచున్నను, ఇంద్రియములు ఇంద్రియ విషయములందు ప్రవర్తించుచున్నవని నిశ్చయించినవాడై, తాను ఏమియు చేయుటలేదు అని తలపవలయును - అనగా కర్తృత్వము తనకు లేదను నిశ్చయ భావములను కలిగియుండవలయును.

* బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా. 10

కర్మలను పరమాత్మయందు సమర్పించి, ఫలాపేక్షను వదలిపెట్టి చేయవలయును. అట్లు చేసినచో తామరాకును నీరు అంటనట్లు వానిని పాపము అంటదు.

* కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే.　　11

కాబట్టి కర్మయోగులు ఫలాపేక్షను వదలి, కేవలము శరీరముతోను, మనస్సుతోను, బుద్ధితోను, ఇంద్రియములతోను మాత్రము అంతఃకరణపరిశుద్ధి కొరకు కర్మలు చేయుదురు.

* యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే.　　12

నిష్కామముగ కర్మచేయు యోగి కర్మఫలమును వదలుటచే, భగవత్ప్రాప్తిరూపమైన శాంతిని పొందుచున్నాడు. యథార్థతత్త్వమును తెలియనివాడు కామముయొక్క ప్రేరణచేతను, ఫలమందు కాంక్షతోను కర్మచేసి, బంధింపబడుచున్నాడు.

* సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహే నైవ కుర్వ న్న కారయన్.　　13

అంతఃకరణమును స్వాధీనము చేసికొన్న పురుషుడు వివేకము కలిగి, మనస్సుచేత సర్వకర్మలను తొమ్మిది ద్వారములు కలిగిన పట్టణమను శరీరమందు విడిచిపెట్టి, తాను చేయకయును, చేయించకయును ఆనందపూర్వకముగ ఉండును.

* న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే.　　14

పరమాత్మ లోకమునకు - అనగా ఎవరికిని - కర్తృత్వమును కలుగజేయలేదు. కర్మను ఏర్పాటు చేయలేదు. ఆ యా కర్మల ఫలములను ఆ యా వ్యక్తులే అనుభవించవలయును అను నియమమును చేయలేదు. అంతయు ప్రకృతివలన జరిగిపోవుచున్నది.

* నాదత్తే కస్యచి త్పాపం నచైవ సుకృతం విభుః
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః. 15

సర్వవ్యాపకుడైన పరమాత్మ తాను స్వతంత్రముగ ఎవనియొక్క పాపపుణ్యములతోను సంబంధమును కలుగజేసికొనడు. జ్ఞానము అజ్ఞానముచేత కప్పబడినది. అందువలన సర్వజీవులును మోహములో పడిపోవుచున్నారు.

* జ్ఞానేన త దజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. 16

పరమాత్మజ్ఞానముచే అజ్ఞానము నశించినవారికి జ్ఞానము సూర్యునివలె పరమార్థతత్త్వమును ప్రకాశింపజేయుచున్నది.

* తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః
గచ్ఛం త్యపునరావృత్తిం జ్ఞాన నిర్ధూత కల్మషాః. 17

పరమాత్మయందే అధ్యవసాయము కలిగిన బుద్ధి గలట్టియు, పరమాత్మయందే నిమగ్నమైన మనస్సు గలట్టియు, పరమాత్మయందే నిష్ఠగలట్టియు, పరమాత్మయే పరమ ప్రయోజనముగ గలట్టియు మహాత్ములు జ్ఞానముచేతపాపముల నన్నిటిని నశింప జేసికొనినవారై, పునరావృత్తిరహితమైన పరమపదవికి పోవుచున్నారు.

* విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః. 18

పండితులైనవారు విద్యావినయములతో కూడుకొన్న బ్రాహ్మణుని యందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, చండాలుని యందును సమభావము కలిగి యుందురు - అనగా,

సర్వత్ర వారికి సర్వాంతర్యామిగ పరమాత్మయే గోచరించు చుండును.

* ఇహైవ తై ర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః. 19

ఈ విధముగ మనస్సు సమభావమందు స్థిరముగ నిలిచియున్న వారు ఇక్కడనే-అనగా జీవించియుండగనే- జననమరణరూపమైన ఈ సంసారమును జయించుచున్నారు-వారు నిర్దోషమును, సర్వ సమమును, సచ్చిదానందస్వరూపమును అగు పరమాత్మయందే స్థిరముగ నిలిచియున్నారు గనుక.

*న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః. 20

స్థిరబుద్ధి కలవాడును, అజ్ఞానము పూర్తిగ నశించినవాడును, పరమాత్మయందే నిలిచియున్నవాడును అయిన బ్రహ్మవిదుడు, అనగా పరమాత్మను తెలిసికొనినవాడు - తన కిష్టమైనది లభించి నప్పుడు సంతోషించడు; అనిష్టమైనది లభించినప్పుడు వ్యసనమును చెందడు.

* బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా వింద త్యాత్మని య త్సుఖమ్
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే. 21

బాహ్య విషయోపభోగములం దేమాత్రమును సక్తతలేక, తన అంతఃకరణమందే పరమాత్మ ధ్యానముచే కలిగిన సాత్త్వి కానందము అనుభవించుచుండువాడు - అనగా పరమాత్మయోగ మందుడున్నవాడు - నాశరహితమైన సుఖమును - అనగా మోక్షమును - పొందుచున్నాడు.

* యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే
ఆద్యంతవంతః కౌంతేయ ! న తేషు రమతే బుధః. 22

అర్జునా ! ఇంద్రియములు విషయములందు ప్రవర్తించుట వలన కలుగు సుఖములు, నిలుకడ ఉండునవి కాకపోవుటచే - అనగా ఆద్యంతములు కలిగి, నశించెడివగుటచే-దుఃఖమునకే కారణము లగుచున్నవి. కనుకనే యథార్థము నెరిగిన బుధులు వాటిని కాంక్ష చేయరు.

* శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః. 23

తన శరీరము పడిపోవుటకు ముందే కామక్రోధాదుల వలన కలుగు ఆవేగమును - క్షోభమును - అణచగలుగువాడే యథార్థము తెలిసినవాడు. వాడే బ్రహ్మానందానుభవసుఖమును పొందగలడు.

* యోఽంతస్సుఖోఽంతరారామ స్తథాంత ర్జ్యోతిరేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి. 24

బాహ్యవిషయములయందు సుఖముకొరకై పరుగులు పెట్టక, తన అంతఃకరణమునందే పరమాత్మ ధ్యానముచే కలుగు సుఖము ననుభవించుచున్నవాడు, తనకు అంతరాత్మగ ఉన్న పరమాత్మ యందే రమించుచున్నవాడు, తనయందు వెలుగుచున్న జ్యోతి స్వరూపుడైన పరమాత్మను తెలిసికొనుచున్నవాడు యోగి. అతడు బ్రహ్మస్వరూపుడై మోక్షమును పొందుచున్నాడు.

* లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః.
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః 25

పాపములన్నియు నశించినట్టియు, సందేహములు సమూలముగ పోయినట్టియు, మనస్సును, సర్వేంద్రియములను జయించి స్వాధీనమం దుంచుకొన్నట్టియు, సర్వభూతములకును మేలు చేయుటయం దాసక్తి గలట్టియు ఋషులు మోక్షమును పొందు చున్నారు.

* కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనామ్. 26

కామక్రోధములు మొదలగునవి పూర్తిగ విడిచినవారును, మనోనిగ్రహము కలవారును, ఆత్మస్వరూపమును తెలిసికొనిన వారును అగు యతీశ్వరులకు బ్రహ్మానందము ప్రతిచోటను దొరకుచున్నది.

* స్పర్శా న్కృత్వా బహి ర్బాహ్యాం శ్చక్షుశ్చైవాంతరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ. 27

* యతేంద్రియమనోబుద్ధి ర్మని ర్మోక్షపరాయణః
విగతేచ్ఛా భయ క్రోధో య స్సదా ముక్త ఏవ సః. 28

బాహ్య విషయములను దూరముగ త్రోసి, చూపును భ్రూమధ్య మందు నిలిపి, ముక్కులోపల సంచరించు ప్రాణాపానములను సమముగచేసి, మనో బుద్ధీంద్రియములను నియమించి, ఆశా భయ క్రోధములను పోగొట్టుకొనినవారు, మోక్షమే ప్రయో జనముగా కలవారు మునులు. వారెప్పుడును ముక్తులే - అనగా జీవించి యున్నను ముక్తులే అని భావము.

* భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి. 29

సమస్తమైన యజ్ఞములకును, తపస్సులకును నేనే భోక్తను. సమస్త లోకములకును నేనే ప్రభుడను. సమస్త ప్రాణులకును మేలుచేయువాడనుకూడ నేనే. ఇట్టి నన్ను తెలిసికొన్నవాడు పరమపదమును పొందుచున్నాడు.

ఓం తత్సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాసయోగో నామ
పంచమోఽధ్యాయః



ఓం శ్రియఃపతయే నమః

ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీ గీతామృతము

## షష్ఠాధ్యాయము – ఆత్మ సంయమ యోగము

శ్రీ భగవానువాచ:

* అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాక్రియః 1

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

తాను చేయవలసిన కర్మను ఫల మపేక్షించక చేయుచున్న వాడే సన్న్యాసి అనియు,కర్మయోగి అనియు చెప్పబడుచున్నాడు. అగ్నిహోత్రములు వదలినంతమాత్రమునను, కర్మలు చేయనంత మాత్రమునను సన్న్యాసియుకాడు, యోగియుకాడు.

* యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ !
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన. 2

అర్జునా ! ఏది సన్న్యాసమని చెప్పబడుచున్నదో, అదియే యోగ మని తెలియుము. సకలకాంక్షలు వదలక ఎవ్వడును యోగి కాజాలడు.

* ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే. 3

యోగమునుపొంద నిశ్చయించి సాధనదశలో ఉన్నవానికి ఆరురుక్షువు అనిపేరు. అట్టివాడు యోగారూఢుడుకావలెనన్నచో నిష్కామభావముతో కర్మలు చేయుటే మార్గము. నిష్కామముగ కర్మలుచేసి, దానివలన అంతఃకరణ పరిశుద్ధిపొంది, సంసార వాసనలు పూర్తిగ నశించినవాడు యోగారూఢుడు అనబడును. అట్టి యోగారూఢునకు కర్మనివృత్తిరూపమైన శమమే కర్తవ్యమని నిర్ణయించబడినది.

* యదా హి నేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే
సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. 4

మానవుడు ఇంద్రియ భోగములందును, కర్మల యందునుకూడ ఆసక్తి ఉంచక, సర్వ సంకల్పములను పూర్తిగ వదలిననాడు గదా యోగారూఢుడు అని చెప్పబడుచున్నాడు!

* ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః. 5

* బంధు రాత్మాత్మన స్తస్య యే నాత్మై వాత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్. 6

తన్ను తానే ఉద్ధరించుకొనవలెను. తన్నుతాను అధోగతిపాలు చేసికొనరాదు. తన మనస్సును, ఇంద్రియములను చక్కగ నియమించుకొని, పరమాత్మధ్యానముతో తన్ను తా నుద్ధరించుకొనవలెను. అట్లుకాక మనస్సును, ఇంద్రియములను విషయముల ననుభవించుటయందే వినియోగించి, కాలమును పాడుచేసికొనువాడు తన్ను తాను అధోగతిపాలు చేసికొనుచున్నాడు. కనుక తనకు తానే మిత్రుడు, తనకు తానే శత్రువు. మనస్సును, ఇంద్రియములను, శరీరమును స్వాధీనము చేసికొని పరమాత్మను పొందు సాధన కుపయోగించుకొనగలిగినవాడు తనకు తానే మిత్రుడు. మనస్సును, ఇంద్రియములను, శరీరమును స్వాధీనము చేసికొనక వాటి ఇష్టమువచ్చినట్లు విషయములందు ప్రవర్తింప నిచ్చువాడు తనకుతానే శత్రువు. అతడు తన్ను తానే అధోగతికి త్రోసికొను చున్నాడు.

* జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః. 7

శీతోష్ణములయందును, సుఖదుఃఖములయందును, మానావమాన ముల యందును అంతఃకరణ వృత్తులు పూర్తిగ శమించినవాడు-అనగా వాటిని లెక్కచేయక సమభావము కలిగియుండువాడు, స్వాధీనమైన మనస్సు కలవాడు. అట్టివానికి పరమాత్మ సదా ప్రత్యక్షమందుండును.

* జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః. 8

జ్ఞాన విజ్ఞానములచేత సంతృప్తి చెందియున్న మనస్సుకలవాడును, తన యథార్థస్వరూపమునుండి చలించక ఉన్నవాడును, ఇంద్రియములను జయించినవాడును, మట్టి, రాయి, బంగారము - వీటియందు సమభావము కలవాడును అగు యోగి, యుక్తుడు-అనగా భగవత్ప్రాప్తికి తగినవాడు లేక భగవత్ప్రాప్తి కలిగిన వాడు - అని చెప్పబడుచున్నాడు.

* సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే. 9

ప్రత్యుపకారమును కోరక సహాయము చేయునట్టి సుహృత్తులు, ప్రతిఫల మపేక్షించి స్నేహము చేయునట్టి మిత్రులు, అపకారము చేయునట్టి శత్రువులు, ఉదాసీనులు, మధ్యస్థులు, ద్వేష్యులు, బంధువులు - అను వీరియందును, సత్త్వగుణ సమృద్ధికల సజ్జనుల యందును, పాపాత్ములయందును సమబుద్ధి కలవాడు శ్రేష్ఠుడు.

* యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. 10

మనోబుద్ధిరూపమైన అంతఃకరణమును వశమందుంచుకొనిన వాడును, ఆశారహితుడును అయి, బాహ్య వస్తువులయందు

మమతలేక, జనులయొక్క రాకపోకలు లేని రహస్యస్థలమందు ఒంటరిగ కూర్చుండి యోగి తనను పరమాత్మ ధ్యానమునందే నియమించుకొనవలెను.

* శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్. 11

* తత్రైకాగ్రం మనః కృత్వా యత చిత్తేంద్రియక్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే. 12

పరిశుద్ధమైన ప్రదేశమందు దర్భాసనము వేసికొని, దానిపైన కృష్ణాజినమును, దానిపైన ఉతికిన ఒక తెల్లనివస్త్రమును పరచవలెను. ఆవిధముగ సిద్ధము చేసికొన్న తనయొక్క ఆసనమును ఎక్కువ ఎత్తును, ఎక్కువ పల్లమును కాకుండ సమానమైన ఎత్తులో ఏర్పాటుచేసికొని, దానిపై కూర్చుండి, చిత్తముయొక్కయు, ఇంద్రియముల యొక్కయు వ్యాపారము నడచి, మనస్సును అనేక విషయములపైకి పోనీక, ఏకాగ్రముచేసి, తాను జననమరణరూపమైన సంసార మలినమునుండి పరిశుద్ధుడగుటకై ధ్యానయోగ మభ్యాసము చేయవలయును.

* సమం కాయ శిరో గ్రీవం ధారయ న్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్. 13

* ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. 14

శరీరమును, తలను, మెడను సమముగ కదలకుండునట్లుంచుకొని, స్థిరుడై - అనగా దృఢమైన భావము కలవాడై - దిక్కులు చూడక, నాసికాగ్రమునందే దృష్టినిలిపి, శాంతచిత్తుడై, భయము లేనివాడై, బ్రహ్మచర్యవ్రత మవలంబించి, మనస్సును వశమం

దుంచుకొని, చిత్తమును నాయందే ఉంచి, మత్పరాయణుడై ఉండవలయును.

* యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. 15

మనస్సును పూర్తిగ వశము చేసికొనిన యోగి, ఆ మనస్సును విషయములందు ప్రవర్తించనీయక నాయందే లగ్నముచేసిన వాడై, నాయందే నెలకొన్నదియు, మోక్షస్వరూపమును అగు శాంతిని - అనగా బ్రహ్మానందమును - పొందుచున్నాడు.

* నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున. 16

అర్జునా ! యోగసిద్ధి అతిగా భుజించువానికి కలుగదు; శరీరమునకు కావలసినంత కూడ భుజింపనివానికిని కలుగదు; అతిగా నిద్రబోవువానికి కలుగదు; అసలు నిద్రపోనివానికిని కలుగదు.

* యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. 17

ఆత్యంతిక దుఃఖనివృత్తిరూపమైన ఈ యోగము సిద్ధించవలెనన్నచో సాత్త్వికమైన ఆహారము శరీరమునకు అవసరమగునంతగ భుజింపవలయును. అట్లే యుక్తమైన విహారము కలిగి యుండవలయును. యోగ్యమైన కర్మలను యోగ్యమైన పద్ధతిలో, యోగ్యమైనంతవరకు ఆచరింపవలయును. అవసరమైనంతవరకు నిద్రపోవలయును. అట్లే అవసరమైనంత మెలకువ కలిగి యుండవలయును.

* యదా వినియతం చిత్త మాత్మన్యే వావతిష్ఠతే
నిస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. 18

ఎప్పుడు చిత్తము బాగుగా వశపడినదై చలనము లేక పరమాత్మ యందే నిలుచుచున్నదో, అప్పుడు యోగి సర్వకామములనుండి పూర్తిగ విడువబడుచున్నాడు. అప్పుడే అతడు శ్రేష్ఠుడని కూడ చెప్పబడుచున్నాడు.

* యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః. 19

గాలిలేని ప్రదేశములో దీపము ఎట్లు కదలక మెదలక ఏకరూపమున ప్రకాశించుచుండునో, అట్లే స్వాధీనమైన యోగియొక్క చిత్తము పరమాత్మధ్యానమందు నిశ్చలముగా ఉండును.

* యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మ నాత్మానం పశ్య న్నాత్మని తుష్యతి. 20

* సుఖ మాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః. 21

* యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే. 22

* తం విద్యా ద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితమ్
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. 23

యోగాభ్యాస పాటవముచే చిత్తమును విషయాంతరములనుండి నివర్తించి సుఖానుభవమును పొందుచున్నవాడు, శిక్షణను పొంది పరిశుద్ధమైన చిత్తముతో పరమాత్మను చూచుచు, ఆ పరమాత్మయందే సంతోషించుచున్నవాడు, ఇంద్రియ గోచరము కానట్టియు, కేవలము వాసనారహితమైన బుద్ధిచేతనే గ్రహింపదగినట్టియు, అంతము లేనట్టియు సుఖమును అనుభవించుచున్న

నాడు, ఆ సుఖమునుండి ఏమాత్రమును చలించనివాడు, తాను పొందిన అనుభూతికంటె బ్రహ్మాధిపత్యమును సైతము అధికముగా తలచనివాడు, ఆ స్థితినుండి భయంకరమైన దుఃఖముచేత కూడ చలింపజేయబడనివాడు - దుఃఖముతో ఎంతమాత్రమును సంబంధములేని ఆ స్థితియే యోగమనియును, అదే యోగసిద్ధి పొందుట అనియును తెలిసికొనవలయును. పట్టుదల, ఉత్సాహము కల మనస్సుచేతనే నిశ్చయపూర్వకముగా అట్టి యోగము ఆచరింపదగినది.

* సంకల్పప్రభవా న్కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. 24

* శనైః శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్. 25

సంకల్పము వలన పుట్టిన కామములను అన్నిటిని వాసనలతో సహా నిశ్శేషముగ త్యజించి, మనస్సుచేత ఇంద్రియ సముదాయమును సమస్త విషయములనుండి చక్కగ మరలించి, క్రమక్రమముగా అభ్యాసము చేయుచు, మనస్సును, ఇంద్రియములను బాహ్యవిషయములనుండి నిగ్రహించుటచే కలిగిన చిత్తశాంతిని పొందవలయును. అట్లు శాంతినిపొందిన చిత్తమును ధైర్యముతో స్వాధీనము చేసికొనిన నిశ్చయాత్మకబుద్ధిచేత మనస్సును పరమాత్మయందే ఉండునట్లు చేయవలెను. పరమాత్మేతరములైన ఏ యితర వస్తువులను ఎంతమాత్రమును చింతించరాదు.

* యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్
తత స్తతో నియమ్యైత దాత్మ న్యేవ వశం నయేత్. 26

చంచలమును, అస్థిరమును అగు ఈ మనస్సు ఏ యే విషయములందు ప్రవర్తించుటకై బయట సంచరించుచున్నదో, ఆ యా

విషయములనుండి ఈ మనస్సును అభ్యాసబలముచే నిగ్రహించి, మాటిమాటికిని పరమాత్మయందే లగ్నముచేయవలయును.

* ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్ 27

ఎవనియొక్క మనస్సు అభ్యాసబలము వలన, విషయచింతనము లేకపోవుటచే అచంచలతను, విక్షేపరాహిత్యమును, స్థిరతను ప్రశాంతతను పొందినదో, ఎవడు రజోగుణ వికారము లేశయును లేనివాడో, సకలపాపములును నశించినవాడో, సర్వము బ్రహ్మమే అను నిశ్చయాత్మకమైనబుద్ధి కలవాడగుటచే సర్వత్ర బ్రహ్మమునే అనుభవించుచున్నాడో అట్టి యోగికి గదా నిరతిశయమైన సుఖము లభించుచున్నది!

* యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే. 28

పాపరహితుడైన యోగి ఈవిధముగ మనస్సును పరమాత్మయందే నిలిపినవాడై, సుఖముగ పరమాత్మప్రాప్తిరూపమైన నిరవధి కానందమును అనుభవించుచున్నాడు.

* సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 29

యోగముచే పరమాత్మను పొందిన యోగి, సర్వత్ర సమదృష్టి కలవాడగుచు, పరమాత్మయందు సర్వభూతములను, సర్వభూతములయందు పరమాత్మను చూచుచున్నాడు.

* యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. 30

ఆ విధముగా ఎవడు సర్వభూతములయందు నన్నును, నాయందు సర్వభూతములను చూచుచున్నాడో, అట్టివానికి నేను ఎప్పుడును కనుపించుచునే ఉందును. నాకు వాడు కనుపించుచునే ఉండును. అనగా, వానిని నేనును, నన్ను వాడును ఎప్పుడును ఎడబాసి ఉండము అని భావము.

* సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః
సర్వథా వ ర్తమానోఽపి స యోగీ మయి వ ర్తతే.        31

ఎవడు ఏకాకారముతో సర్వభూతములయందు ఉన్న నన్ను పొందినవాడై, భజించుచున్నాడో, అట్టి యోగి అన్నివిధముల చేతను ప్రవ ర్తించుచున్నవాడైనను నాయందే ప్రవ ర్తించుచున్నవాడగుచున్నాడు.

* ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున !
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః.        32

సర్వత్ర పరమాత్మదృష్టి కలిగి, సుఖములందు గాని, దుఃఖములందు గాని సమత్వమును కలిగియుండువాడు - "తనయందు నఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరుగువాడు"- అట్టియోగి - ఉ త్తమో త్తము డని నా అభిప్రాయము.

అర్జున ఉవాచ :

* యోఽయం యోగ స్త్వయా ప్రోక్త స్సామ్యేన మధుసూదన!
ఏత స్యాహం న పశ్యామి చంచలత్వా త్స్థితిం స్థిరామ్.        33

* చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవ ద్దృఢమ్
తస్యాహం నిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరమ్.        34

అర్జునుడు అడుగుచున్నాడు :

ఓ మధుసూదనా! నీవు చెప్పిన సమత్వరూపమైన ఈ యోగమును స్థిరముగ అవలంబించలేకున్నాను. ఏలయన ఈ మనస్సు అతి చంచలమైనది. ఓ కృష్ణా! చంచలమైన మనస్సు క్షోభపెట్టుటయే స్వభావముగ కలదియు, మిక్కిలి బలమైనదియు, దృఢమైనదియు అయి ఉన్నది. దానిని నిగ్రహించి జయించుట, వాయువును నిగ్రహించుటవలెనే, మిక్కిలి దుష్కరమని తలచుచున్నాను.

శ్రీ భగవానువాచ :

* అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే. 35

* అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః. 36

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

అర్జునా! నీవు చెప్పినది సత్యమే. మనస్సు చంచలమైనదియును, నిగ్రహించుటకు కష్టమైనదియును. కాని, ఉద్దేశము కలవానికి ఉపాయము లేకపోలేదు. ఆ మనస్సు అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను వశము చేసికొనబడుచున్నది. అట్లు చిత్తమును వశమునకు తెచ్చుకొనలేనివానికి యోగము పొందశక్యముకాదు. చిత్తమును తన వశమునం దుంచుకొనగలిగిన వాడు ప్రయత్నించి యోగమును సహజముగనే పొందుచున్నాడు. ఇదియే నా అభిప్రాయము.

అర్జున ఉవాచ :

* అయతి శ్శ్రద్ధయోపేతో యోగాచ్చలిత మానసః
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి. 37

అర్జునుడు అడుగుచున్నాడు :

కృష్ణా! ఒకడు శ్రద్ధతో కూడుకొనియున్నాడు; కాని, తగిన యత్నముచేయనివాడై యున్నాడు. యోగమునుండి చలించిన మనస్సు కలవాడు. అట్టివాడు పరమాత్మ సాక్షాత్కారరూపమైన యోగసిద్ధిని పొందక, ఏమగుచున్నాడు? వాని గతి ఏమి?

* కచ్చి న్నోభయ విభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి. 38

ఓ మహాబాహూ! వాడు పరమాత్మను పొందు మార్గమునుండి వంచింపబడినవాడై, నిరాధారుడగుచు, ఛిన్నమైన, భిన్నమైన మేఘఖండమువలె ఉభయలోకములకు చెడినవాడై నశింపడు కదా!

* ఏత న్మే సంశయం కృష్ణ! ఛేత్తు మర్హ స్యశేషతః
త్వదన్య స్సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే. 39

కృష్ణా! నా ఈ సంశయమును పూర్తిగ నివారించుటకు నీవే సమర్థుడవు. ఈ సంశయమును నివారించుటకు సమర్థుడైనవాడు నీకంటె అన్యుడెవడును లేడు.

శ్రీ భగవానువాచ :

* పార్థ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
న హి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి. 40

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

అర్జునా! అట్టివానికీ లోకమునందును నాశములేదు. పరలోకమునందును నాశములేదు. తండ్రీ! పరమాత్మ సంబంధమైన ప్రయత్నము చేయువాడెప్పుడును దుర్గతిపాలు కాడుసుమా!

* ప్రాప్య పుణ్యకృతాన్ లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. 41

ఐతే, ఏమి జరుగునందువా, యోగభ్రష్టుడైన మానవుడు యజ్ఞయాగాది పుణ్యకర్మలు చేసినవారు పోవు స్వర్గాదిలోకములు పొంది, అనేక సంవత్సరములు నివసించి, తరువాత సదాచార సంపత్తిగల శ్రీమంతుల గృహములందు పుట్టుచున్నాడు.

* అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. 42

కాక జ్ఞానులైన యోగుల వంశమందైన జన్మించుచున్నాడు. ఇట్టి జన్మము కలుగుట ఈ లోకమునందు బహుదుర్లభము.

* తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన ! 43

* పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. 44

ఓ కురునందనా ! అట్లు జన్మించినవాడు వాని పూర్వజన్మయందలి యోగసంబంధమైన సంస్కారములును, జ్ఞానమును కలిగియుండును. వాటి ప్రభావమువలన వాడు మరల యోగసిద్ధి కొరకు పూర్వముకంటె ఎక్కువగా ప్రయత్నించును. పూర్వజన్మయందలి అభ్యాస వాసనాబలమున సహజముగనే యోగాభ్యాసము వైపునకు ఆకర్షింపబడుచున్నాడు. యోగతత్త్వజిజ్ఞాసువుకూడ వేదోక్త కర్మవిధానమువలన కలిగెడి ఊర్ధ్వలోకభోగము లన్నిటిని అతిక్రమించుచున్నాడు.

* ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః
అనేక జన్మ సంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్. 45

కాని, పట్టుదలతో యత్నముచేయు యోగి, సమస్తపాపములు పూర్తిగ పోగా, అనేక జన్మములయందలి అభ్యాసముల ఫలమైన సిద్ధిని పొందినవాడై పరమగతికి పోవుచున్నాడు.

* తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవా ర్జున ! 46

యోగి తపస్వులందరికంటెను శ్రేష్ఠుడు. జ్ఞానులకంటె కూడ శ్రేష్ఠుడు. కర్మనిష్ఠుల కంటెను శ్రేష్ఠుడు. కావున అర్జునా! నీవు యోగివి కమ్ము !

* యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా
శ్రద్ధావా న్భజతే యో మాం స మే యుక్తతమో మతః. 47

నాయందే ఆసక్తమైన చిత్తముతో శ్రద్ధావంతుడై నన్నే భజించుచున్నవాడు సమస్తయోగులలో కూడ గొప్పవాడని నా అభిప్రాయము.

ఓం తత్ సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే ఆత్మసంయమయోగో నామ
షష్ఠోఽధ్యాయః

ఓం శ్రియఃపతయేనమః

ఓం శ్రీపరమాత్మనేనమః

# శ్రీ గీ తా మృ త ము

## సప్తమాధ్యాయము — విజ్ఞానయోగము

శ్రీ భ గ వా ను వా చ :

* మయ్యాసక్తమనాః పార్థ ! యోగం యుంజన్మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ! 1

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

ఓ అర్జునా ! నాయందే ఆసక్తిగల మనస్సుకలిగి, నన్నే ఆశ్రయించి యోగము నాచరించుచున్నవాడవై, నన్ను కొరత లేకుండునట్లు సంపూర్ణముగ ఎట్లు తెలిసికొనగలుగుదువో చెప్పెదను వినుము.

* జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞా తవ్యమవశిష్యతే. 3

నన్ను గురించిన విజ్ఞానముతో కూడిన జ్ఞానమును సంపూర్ణముగ నీకు చెప్పెదను. దానిని తెలిసికొనిన తరువాత ఇంక ఇక్కడ తెలిసికొనవలసిన దేమియును మిగులదు.

* మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః. 3

వేలకొలది మానవులలో ఎవడో ఒక్కడు నన్ను తెలిసికొనుటకు ప్రయత్నించుచున్నాడు. అట్టివారిలో సైతము ఏ ఒక్కడో నన్ను యథార్థముగ తెలిసికొనగలుగుచున్నాడు.

* భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా. 4

* అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్
జీవభూతాం మహాబాహో! య యేదం ధార్యతే జగత్. 5

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అని నా ప్రకృతి ఎనిమిది విధములు. దీనికి అపరాప్రకృతి అని పేరు. పార్థా! నాయొక్క పరాప్రకృతి ఇంకొకటి కలదు. అది ఈ సమస్తజగత్తును ధరించుచున్న జీవరూపమైనది.

* ఏత ద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా. 6

మనకు కనబడుచున్న చరాచరాత్మకమైన ఈ జగత్తంతయును కలుగుటకు నా ఈ రెండు ప్రకృతులే కారణము. సంపూర్ణమైన ఈ జగత్తు పుట్టుటకు, నశించుటకు స్థానమైనవాడను నేనే. ఈ జగత్తంతకును మూలకారణమును నేనే.

* మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ!
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. 7

అర్జునా! నాకంటె అధికమైన దేదియును లేదు. దారమునందు మణులు గ్రుచ్చబడి, దారమునే ఆశ్రయించి ఉన్నట్లు చిదచిద్వస్తు సమూహమైన ఈ సర్వజగత్తును నాయందే ఆధారపడి, నన్నాశ్రయించియే ఉన్నది.

* రసోఽహ మప్సు కౌంతేయ! ప్రభాస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు. 8

ఓ అర్జునా ! జలములందలి రసమును నేను. చంద్రుని యందలియు, సూర్యుని యందలియు ప్రకాశమును నేను. సర్వ వేదములయందును ప్రణవమును నేను. ఆకాశమందలి శబ్దమును నేను. మానవులయందలి పౌరుషమును నేను - అనగా కర్తృత్వ శక్తిని నేను.

* పుణ్యో గంధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు. 9

భూమియందలి పవిత్ర పరిమళమును నేను. అగ్నియొక్క తేజస్సు నేను. సర్వభూతముల యందలి జీవనమును నేను. తాపసోత్తముల లోని తపస్సును నేను.

* బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్. 10

ఓ పార్థా ! సకల భూతములయొక్కయు ఉత్పత్తికి నిత్యమైన మూలకారణమును నేనని తెలిసికొనుము. బుద్ధిమంతులలోని బుద్ధిని నేను. తేజస్వంతులయొక్క తేజమును నేను.

* బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ! 11

బలవంతులయొక్క కామ రాగ రహితమైన బలమును నేను - అనగా, ఎవరిబలము అధర్మమార్గమున ఉపయోగపడదో, ధర్మమునకు సహాయపడుచున్నదో, వారిబలమును నేను. భూతములందలి ధర్మవిరుద్ధము కాని కామమును నేను.

* యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి. 12

సత్త్వరజస్తమోగుణములకు సంబంధించిన సర్వభావములును నావలననే కలిగినవని తెలిసికొనుము. కాని, వాటియందు నేను లేను; నాయందవి లేవు. అనగా నేను త్రిగుణమయమైన భావములకు కారణమైనవాడను, ఆధారమైనవాడనే కాని, ఆ భావములు నన్ను వశపరచుకొనలేవు. నేను ఎప్పుడును గుణాతీతుడనే.

* త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్
మోహితం నాభిజానాతి మామేభ్యః పర మవ్యయమ్. 13

ఈ త్రిగుణములకు సంబంధించిన భావములచే ఈ జీవసముదాయమంతయు మోహింపజేయబడి ఉన్నది. కాబట్టి, త్రిగుణములకునుకూడ అతీతుడను, నాశరహితుడను అయిన నన్ను తెలిసికొనలేకుండ ఉన్నది.

* దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే. 14

సత్త్వరజస్తమోగుణములచే నిండినదియును, అత్యద్భుతమైనదియును అగు నా మాయను ఎవరును దాటలేరు. నా పాదములు ఆశ్రయించి, నన్ను శరణు పొందినవారు మాత్రమే ఈ నా మాయను దాటగలరు.

* న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః
మాయ యాపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః. 15

కాని, అర్జునా ! దుష్కార్యములాచరించువారును, మూఢులును అయిన నరాధములు నన్ను శరణు పొందరు. ఏలయన వారి జ్ఞానము మాయచే హరింపబడుటవలన రాక్షసప్రకృతిని ఆశ్రయించినవారై, నన్ను శరణు పొందరు.

* చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున !
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ! 16

ఎప్పుడును సత్కార్యములనే ఆచరించుచు నన్ను భజించు జనులు నాలుగు విధములుగ ఉన్నారు. ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు.

* తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః 17

వీరిలో సర్వకాల సర్వావస్థల యందును నాయందే మనస్సును లగ్నముచేసి, చలించని ముఖ్యమైన భక్తిగల జ్ఞాని శ్రేష్ఠుడు. అట్టి జ్ఞానికి నేను అత్యంత ప్రియుడను. జ్ఞాని నాకు అత్యంత ప్రియుడు.

* ఉదారా స్సర్వ ఏ వైతే జ్ఞానీ త్వా త్మైవ మే మతమ్
ఆస్థిత స్సహి యుక్తాత్మా మామే వాను త్తమాం గతిమ్. 18

నన్ను భజించువారందరును మంచివారే. కాని, ఏ కోరికయును లేక, చివరకు మోక్షమందు కూడ వాంఛ లేక, కేవలము ప్రేమచేతనే నన్ను భజించు జ్ఞాని అన్ననో, నాకు ప్రాణమే. ఏలయన, అతడు మనస్సును, బుద్ధిని, నా పరముజేసి, నన్నే పరమగతిగ నిశ్చయించుకొని ఉన్నవాడు.

* బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః. 19

మానవుడు అనేక జన్మములు గడచిన తరువాత జ్ఞానముకలవాడై నన్ను భజించుచున్నాడు. ప్రతి-చోటను పరమాత్మనే అనుభవించ గల మహాత్ముడు చాల దుర్లభుడు కదా !

* కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా. 20

తమ తమ ప్రకృతిచే - అనగా పూర్వజన్మల యొక్క పాప వాసనలచే - ప్రేరేపింపబడిన కోరికలవలన జ్ఞానముపోయినవారు- అనగా బుద్ధి చెడినవారు - పరమాత్మనైన నన్ను వదలి, ఇతర దేవతలను భజించుచున్నారు.

* యో యో యాం యాం తనుంభక్త శ్శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్య త స్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్. 21

ఎవరెవరు, ఏ యే దేవతలను శ్రద్ధతో భజించ కోరుచున్నారో, వారి వారి కా యా దేవతలయందే శ్రద్ధను స్థిరమైనదానినిగ చేయుచున్నాను.

* స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే
లభతే చ తతః కామా న్మయైవ విహితా న్హితాన్. 22

వారు ఆ శ్రద్ధతోనే కూడుకొని, ఆ దేవతలను ఆరాధించుచున్నారు. నాచేత నిర్ణయింపబడిన ఫలములనే ఆ దేవతల ద్వారమున పొందుచున్నారు.

* అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసామ్
దేవా న్దేవయజో యాంతి మద్భక్తా యాంతి మా మపి. 23

కాని, ఆ తెలివితక్కువవారు పొందు ఆ ఫలములు నిత్యములు కావు. కొంతకాలమునకు నశించిపోవునవే. దేవతలను ఆరాధించువారు దేవతలనే పొందుచున్నారు. నా భక్తులు నన్నే పొందుచున్నారు.

* అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః
పరం భావ మజానంతో మ మావ్యయ మనుత్తమమ్. 24

* నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్. 25

శ్రేష్ఠమైనదియును, నాశము లేనిదియు అగు విలక్షణమైన నా స్వరూపమును తెలిసికొనలేని అజ్ఞానులు మనోబుద్ధీంద్రియముల కందని నన్ను మానవమాత్రునిగ తలచుచున్నారు. నేను అందరకును తెలియబడక నా యోగమాయచే గూఢముగ ఉన్నాను. కాబట్టి, ఈ మూఢలోకము నాశము లేనట్టియు, జన్మ లేనట్టియు నన్ను తెలిసికొనలేకుండ ఉన్నది.

* వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున!
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన. 26

ఓ అర్జునా! భూత భవిష్య ద్వర్తమానములందలి సమస్త భూతములను నే నెరుగుదును. కాని, ఒక్కడును నన్ను తెలిసికొనలేడు.

* ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వమోహేన భారత !
సర్వభూతాని సమ్మోహం సర్గేయాంతి పరంతప ! 27

రాగద్వేషములచే కలిగిన సుఖదుఃఖాదు లనెడి ద్వంద్వరూపమైన మోహముచే సర్వభూతములును, అజ్ఞానమును - అనగా భ్రమను - పొందుచున్నవి.

* యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః. 28

కాని, పుణ్యకర్మలను ఆచరించుటచే పాపములు పోగొట్టుకొనిన వారు మాత్రము సుఖదుఃఖాది ద్వంద్వరూపమైన మోహము నుండి విడివడి, చలించని దీక్షతో నన్ను భజించుచున్నారు.

* జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్. 29

నన్ను శరణు పొంది జరామరణరూపమైన సంసారమునుండి విముక్తులగుటకు ప్రయత్నించువారికి పరబ్రహ్మస్వరూపమును, సర్వజీవసముదాయమునకు, సర్వకర్మలకు సంబంధించిన యథార్థ తత్త్వమంతయును తెలియును.

* సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః
ప్రయాణకాలేఽపి చ మాం విదుర్యుక్తచేతసః. 30

ఇంకను నన్ను అధిభూత సహితునిగను, అధిదైవ సహితునిగను అధియజ్ఞ సహితునిగను ప్రయాణకాలమందుకూడ తెలిసికొన గలవారు - అనగా తెలిసికొనిన జ్ఞానమును స్థిరమైనదిగ-మధ్య మధ్య మరుపుగాని; సందేహములుగాని లేనిదిగ - నిలుపుకొన గలవారు - మనస్సును వశమునందుంచుకొనగల అట్టివారు - నన్ను తెలిసికొన్నవారు.

ఓం తత్సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విజ్ఞానయోగోనామ
సప్తమోఽధ్యాయః

ఓం శ్రీయఃపతయేనమః

ఓం శ్రీపరమాత్మనేనమః

# శ్రీ గీతామృతము

## అష్టమాధ్యాయము – అక్షరపరబ్రహ్మయోగము

అర్జున ఉవాచ :

* కిం తద్బ్రహ్మ ? కి మధ్యాత్మం ? కిం కర్మ ? పురుషోత్తమ !
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే ? 1

* అధియజ్ఞః కథం ? కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన !
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ? 2

అర్జునుడు అడుగుచున్నాడు :

పురుషోత్తమా ! ఆ బ్రహ్మమనగ ఏమి ? అధ్యాత్మ మనగ ఏమి ? కర్మ అనగ ఏమి ? అధిభూతమనగ ఏమి ? దేనిని అధిదైవ మందురు ? ఈ దేహమునం దధియజ్ఞ మనగ ఏమి ? ప్రాణము పోవునప్పుడు - అనగా దేహపతనకాలమందు - నిన్ను తెలిసికొనుట ఎట్లు ?

శ్రీ భగవా నువాచ :

* అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః. 3

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

బ్రహ్మ మనగ నాశము లేనట్టియు, ప్రకృతికి పరుడైనట్టియు, సచ్చిదానందామల పరిపూర్ణుడైన పరమాత్మయే. జీవాత్మ స్వరూపమే అధ్యాత్మమనబడును. సమస్త ప్రాణికోట్లు పుట్టుటకు - అనగా సృష్టికి - ఆదికారణమైన పరమాత్మ సంకల్పమే కర్మ అను పేర ఒప్పుచున్నది.

* అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతమ్
అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహభృతాం వర ! 4

మానవులలో గొప్పవాడవైన ఓ అర్జునా ! నశించెడి స్వభావము గల పదార్థము లన్నియు అధిభూత మనబడును. హిరణ్యగర్భుడైన పురుషుడే - అనగా బ్రహ్మయే - అధిదైవము. ఈ శరీరములో అంతర్యామి స్వరూపముగ ఉన్న నేనే అధియజ్ఞము అనబడుదును.

* అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః. 5

అంత్యకాలమున నన్నే స్మరించుకొనుచు ఈ దేహమును విడిచినవాడు నాస్వరూపమునే పొందుచున్నాడు. ఈ విషయమున ఎంతమాత్రమును సందేహమునకు తావులేదు.

* యం యం వాపి స్మరన్భావం త్యజ త్యంతే కళేబరమ్
తం త మేవైతి కౌంతేయ సదా తద్భావభావితః. 6

అర్జునా! మానవుడే యే భావములను స్మరించుకొనుచు శరీరమును వదలుచున్నాడో, ఆ యా భావములనే పొందుచున్నాడు. మానవుడు జీవితకాలమున ఏవిషయమును ఎక్కువ చింతించుచుండునో, మరణకాలమున ఆ విషయమే స్మరణకు వచ్చితీరును. కాబట్టి ఎప్పుడును పరమాత్మనే చింతించుచుండవలెగాని, మరణసమయములో చింతించుకొందమని కూర్చొనరాదు. అప్పుడు మనోబుద్ధీంద్రియములు స్వాధీనములో ఉండవు.

* తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ
మ య్యర్పిత మనోబుద్ధి ర్మా మే వైష్య స్యసంశయః. 7

కనుక ఓ అర్జునా ! సర్వకాలములయందును నన్నే స్మరించుకొనుచు, నీ వర్ణాశ్రమ విహితమైన యుద్ధమును చేయుము. ఇట్లు

చేసిన యెడల నాయందు దర్పింపబడిన మనస్సును, బుద్ధియు, కలవాడవై నన్నే పొందెదవు. సందేహ మెంతమాత్రమును లేదు.

* అభ్యాస యోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్. 8

చిత్తమును ఇతరము వైపునకు పోనీయక, ఎల్లప్పుడును పరమాత్మ నైన నన్నే ధ్యానముచేయుట అభ్యాసము చేసినవాడు ప్రకాశ స్వరూపుడను, పరమపురుషుడను అగు నన్నే పొందుచున్నాడు.

* కవిం పురాణ మనుశాసితార
మణో రణీయాంస మనుస్మరేద్యః
సర్వస్య ధాతార మచింత్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. 9

* ప్రయాణకాలే మనసాచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ
భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యమ్. 10

సర్వజ్ఞుడును, పురాతనుడును, సర్వమునకును నియంతయును, సూక్ష్మముకంటె సూక్ష్మమైనవాడును, సమస్తమును భరించి పోషించువాడును,ఊహించుటకు వీలులేని స్వరూపముకలవాడును, సూర్యునివంటి ప్రకాశము కలవాడును, ప్రకృతి కతీతుడును, శుద్ధ సచ్చిదానంద ఘనుడును అయిన పరమాత్మను, భక్తితోను, యోగబలముతోను కూడుకొన్న, నిశ్చలమైన మనస్సుతో, భ్రూమధ్యదేశమున ప్రాణమును బాగుగ స్థాపించి, మరణకాల మందు స్మరించుచుండువాడు ఆ పరమపురుషుని పొందుచున్నాడు.

* య దక్షరం వేదవిదో వదంతి
విశంతి య ద్యతయో వీతరాగాః
య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
త త్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 11

వేదవిదులు నాశరహితమైనదిగ చెప్పుదానిని, సర్వాపేక్షలు నశించిన యతీశ్వరులు పొందుదానిని - దేనిని పొందగోరి వారు యతులై బ్రహ్మచర్యమందు ప్రవర్తించుచున్నారో అట్టిదానిని - పరమపదమును - గూర్చి నీకు సంగ్రహముగ చెప్పెదను.

* సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ
మూర్ధ్న్యాధా యాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్. 12
* ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాం గతిమ్. 13

సమస్తేంద్రియ ద్వారములను విషయములనుండి మరలించి, మనస్సును హృదయపుండరీకమందు నిలిపి, తన ప్రాణమును శిరస్సునందుండు బ్రహ్మనాడియందుంచి, యోగధారణమును - అనగా నిశ్చలస్థితిని - పొంది, పరబ్రహ్మవాచకమైన 'ఓమ్' అను ఒక అక్షరమును ఉచ్చరించుచు, ఓంకారవాచ్యుడనైన నన్ను స్మరించుచు, శరీరమును విడిచి పోవుచున్నవాడు పరమ గతిని పొందుచున్నాడు.

* అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః
త స్యాహం సులభః పార్థ ! నిత్యయుక్తస్య యోగినః. 14

ఓ పార్థా ! చిత్తము అన్యమువైపునకు పోనీయక సర్వకాల సర్వావస్థల యందును నన్నే స్మరించువారికి - నాతో నిత్య సంబంధముగల అట్టి యోగులకు - నేను సులభుడను.

* మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః. 15

పరమసిద్ధిస్వరూపుడనైన నన్ను పొందిన మహాత్ములు, నన్ను పొందినపిదప మరల దుఃఖనిలయమైనదియు, క్షణభంగురమైనదియు అగు పునర్జన్మమునకు రారు.

* ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున!
మా ముపేత్య తు కౌంతేయ! పునర్జన్మ న విద్యతే. 16

అర్జునా! బ్రహ్మలోకము వరకు ఉన్న సర్వలోకములును పునరావృత్తి కలిగినవే. అనగా, ఆ యా లోకములకు పోయిన జీవులు మరల మరల జననమరణరూపమైన సంసారమునకు రావలసినవారే. కాని నన్ను పొందినవారికి మాత్రము మరల జన్మము లేదు.

* సహస్రయుగపర్యంత మహ ర్యద్బ్రహ్మణో విదుః
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః. 17

వేయి మహాయుగములు బ్రహ్మకొక్క పగలును, అంతే కాలము ఒక్క రాత్రియును అని తెలిసికొనగలవారు కాలతత్త్వము తెలిసినవారు.

* అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవం త్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే. 18

బ్రహ్మయొక్క పగటి కాల ప్రారంభమందు, అవ్యక్తమునుండి సకల చరాచర భూతములును పుట్టుచున్నవి. బ్రహ్మయొక్క రాత్రికాలము ప్రారంభించగనే మరల ఈ భూతరాశి అంతయు ఆ అవ్యక్తమునందే లీనమగుచున్నది.

* భూతగ్రామ స్స ఏ వాయం భూత్వా భూత్వా ప్రలీయతే
రా త్ర్యాగమేఽవశః పార్థ ! ప్రభవ త్యహరాగమే. 19

ఈ సమస్తమైన భూతరాశియు, తనకు ఇష్టమున్నను లేకపోయినను, తాను చేసిన కర్మప్రకారము వశము తప్పి,మాటిమాటికిని బ్రహ్మయొక్క రాత్రికాలమున లయమును పొందుచున్నది; పగలు ప్రారంభించగనే పుట్టుచున్నది.

* పర స్తస్మాత్తు భావోఽన్యో వ్యక్తోఽవ్యక్తా త్సనాతనః
య స్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి. 20

ఇపుడు చెప్పిన ఈ అవ్యక్తముకంటె మిక్కిలి శ్రేష్ఠమైనదియును, విలక్షణమైనదియును, సనాతనమైనదియును అగు అవ్యక్తవస్తువు ఒకటి కలదు. సర్వభూతములు నశించిననుకూడ అది నశింపక అట్లే ఉండును.

* అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్త మాహుః పరమాం గతిమ్
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ. 21

ఆ అవ్యక్తము అక్షరమని చెప్పబడుచున్నది. దానినే సర్వోత్కృష్టమైన ప్రాప్యస్థానముగ చెప్పుచున్నారు. దానిని పొందినవారు తిరిగిరారు. అదియే పరమోత్కృష్టమైన నా స్థానము - అనగా పరమపదము.

* పురుష స్స పరః పార్థ ! భక్త్యా లభ్య స్త్వనన్యయా
య స్యాంతస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్. 22

సకల చరాచర భూతములు ఎవని లోపల ఉన్నవో, ఎవనిచేత ఈ సకలజగత్తు వ్యాప్తమై ఉన్నదో,అట్టి పరమపురుషుని అనన్య భక్తిచేతనే లభించును.

* యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ ! 23

కౌంతేయా ! యోగులు దేహమును విడిచి, ఏ కాలాభిమాన దేవత లుండు మార్గమున ప్రయాణముచేసినచో పునరావృత్తి రహిత పదవి పొందుటయో, మరల పుట్టుకకు వచ్చుటయో జరుగునో, ఆ విషయమును చెప్పుచున్నాను.

* అగ్ని ర్జ్యోతి రహః శ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణమ్
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. 24

రెండువిధములైన మార్గములలో జ్యోతిర్మయమైన అగ్నియొక్క అభిమానదేవతయు, పగటియొక్క అభిమానదేవతయు, శుక్ల పక్షాభిమానదేవతయు, ఉత్తరాయణమను ఆరు మాసముల యొక్క అభిమానదేవతయు కల మార్గమునందు, దేహమును విడిచి ప్రయాణముచేసిన మహాత్ములు పరబ్రహ్మమునే పొందుచున్నారు.

* ధూమో రాత్రి స్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనమ్
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే. 25

ధూమాభిమానదేవతయు, రాత్రికి అభిమానదేవతయు, కృష్ణ పక్షాభిమాన దేవతయు, దక్షిణాయనమను ఆరుమాసములకు అభిమానదేవతయు కల మార్గమున ప్రయాణముచేసిన యోగులు చంద్రమండలద్వారమున స్వర్గాదిలోకములకు పోయి, తమ తమ భోగములు పూర్తికాగనే తిరిగి వత్తురు.

* శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే
ఏకయా యా త్యనావృత్తి మన్య యావర్తతే పునః. 26

లోకమునకు శుక్లమార్గము, కృష్ణమార్గము అను ఈ రెండు మార్గములును శాశ్వతముగ ఏర్పడియున్నవి. శుక్లమార్గమే అర్చిరాదిమార్గమనియు, దేవయానమనియు కూడ చెప్పబడును. కృష్ణమార్గము ధూమాదిమార్గమనియు పితృయానమనియు చెప్పబడును. మొదటిమార్గమున పోయినవారు మరల రారు. కామ్యకర్మలు ఒనరించుటచే రెండవమార్గమున పోయినవారు మరల వత్తురు.

* నైతే సృతీ పార్థ జానన్యోగీ ముహ్యతి కశ్చన
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ! 27

అర్జునా ! ఈ రెండు మార్గముల యొక్క యథార్థ తత్త్వమును తెలిసికొనిన యోగి, ఎప్పుడును మోహమును పొందడు. కనుక నీవు సర్వకాలముల యందును మొదటి మార్గమునకు తగిన యోగము కలవాడవు కమ్ము.

* వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్.
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్. 28

ఇట్టి యోగి వేదములందును, యజ్ఞములందును, తపస్సులందును, దానములందును, ఏ ఫలము కలుగునని చెప్పబడి యున్నదో, దానిని మించి- అనగా స్వర్గాదిలోకములను మించి- సనాతనమైన పరమపదమును పొందుచున్నాడు.

ఓం తత్ సత్

ఇతి శ్రీమ ద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అక్షరపరబ్రహ్మ
యోగోనామ అష్టమోఽధ్యాయః

ఓం శ్రియఃపతయే నమః
ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీ గీతామృతము

## నవమాధ్యాయము – రాజవిద్యా రాజగుహ్య యోగము

శ్రీ భగవానువాచ :

* ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 1

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

అర్జునా ! నీవు అసూయ లేనివాడవు. కాబట్టి నీకు పరమ రహస్య మైనదియును, విజ్ఞానసహితమైనదియును అగు ఈ జ్ఞానమును చెప్పుచున్నాను వినుము. దీనిని తెలిసికొని ఆచరించుటచే నీవు అశుభరూపమైన ఈ సంసారమునుండి విముక్తిని పడయగలవు.

* రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్. 2

ఈ జ్ఞానము విద్యలకెల్ల రాజు. రహస్యములలోకెల్ల శ్రేష్ఠ మైనది. అతి పవిత్రము, ఉత్తమము అయినది. ప్రత్యక్ష ఫలము కలది. అనగా ఈ జ్ఞానమునకు ఫలరూపమైన నన్ను ప్రత్యక్షము చేయునది. సర్వోత్కృష్ట ధర్మస్వరూపమును, ఎప్పటికిని నష్టము కానిదియు, అనుష్ఠించుట అతిసుఖమును అయినది.

* అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప!
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసార వర్త్మని. 3

అర్జునా ! ఈ ధర్మమునందు శ్రద్ధలేని పురుషులు నన్ను పొందక, జనన మరణ రూపమైన సంసారచక్రమునందు చిక్కుకొని, ఉక్కిరి బిక్కిరి అగుచున్నారు.

* మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా
మత్థ్సాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః. 4

ఈ సమస్తమైన జగత్తును అవ్యక్త స్వరూపుడనైన నాచేత వ్యాప్తమైనది. సకల చరాచర భూతములకును నేనే ఆధారమై ఉన్నాను. అంతేకాని, అవి ఏవియును నాకాధారములు కావు.

* న చ మత్థ్సాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్
భూతభృ న్న చ భూతస్థో మమాత్మా భూతభావనః. 5

అర్జునా ! ఈశ్వర సంబంధమైన నా యోగశక్తిని కనుగొనుము. భూతములందేవియును నాయందు లేవు. భూతముల నన్నిటిని భరించుచున్నాను కాని, భూతములందు నేను లేను నాయొక్క సంకల్పమే భూతముల నన్నిటిని సృష్టించుచున్నది, పోషించుచున్నది, నియమించుచున్నది. అనగా సర్వభూతములకును లోపల, వెలుపల నేను వ్యాపించి యున్నాను. భూతములకు నే నంటుబడను, భూతములు నా కంటుబడవు.

* యథాకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్
తథా సర్వాణి భూతాని మత్థ్సా నీ త్యుపధారయ. 6

ఆకాశమున పుట్టిన వాయువు సర్వత్ర వ్యాపించి, సదా ఆకాశమందే ఎట్లున్నదో, అదే విధముగ సమస్త భూతములు నాయందున్నవని తెలియుము.

* సర్వభూతాని కౌంతేయ ! ప్రకృతిం యాంతి మామికామ్
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్. 7

ఓ కౌంతేయా ! కల్పాంతమందు సర్వ భూతములును నాయొక్క ప్రకృతియందు లీనమగుచున్నవి. కల్పప్రారంభమందు మరల వాటిని నేను యథారీతిగ సృజించుచున్నాను.

* ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్. 8

నా ప్రకృతిని- అనగా మాయను-అవలంబించి సమస్త జీవ సముదాయమును వాని వాని పూర్వకర్మానుగుణముగ, మరల మరల సృజించుచున్నాను. ఈ భూతసముదాయ మంతయు ప్రకృతికి వశమై ఉండుటచే స్వాతంత్ర్యము లేక స్వాధీనముతప్పి ఉన్నది.

* న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ !
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు. 9

ఉదాసీనునివలె ఆసక్తి రహితుడనై, సృష్టి స్థితి లయ రూపములగు కర్మలు చేయుచున్నాను. కాబట్టి నన్నా కర్మలు బంధింపనేరవు.

* మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్
హేతు నానేన కౌంతేయ ! జగ ద్విపరివర్తతే. 10

సర్వసాక్షీభూతుడనైన నావలన ప్రకృతి సకలచరాచరాత్మకమైన ఈ జగత్తునంతను కనుచున్నది. ఈ కారణముచేతనే, అర్జునా ! ఈ సంసారచక్రము తిరుగుచున్నది.

* అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్. 11

కారుణ్యాది కల్యాణగుణములు కలవాడ నగుటచే జగద్రక్షణార్థము మానవరూపము ధరించి వచ్చితిని. అట్టి నన్ను సర్వభూతములకును మహేశ్వరుడనైన నాయొక్క పరత్వమును తెలిసికొనలేక మూఢులు చులకన చేయుచున్నారు.

* మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. 12

రాక్షసీప్రకృతిని, ఆసురీప్రకృతిని, మోహినీప్రకృతిని ఆశ్రయించిన మూఢులు స్థిరత్వములేక క్షణమున కొక రకముగ మారునట్టి చిత్తము కలవారై, ఉపయోగము లేని ఆశలు, ఉపయోగము లేని కర్మలు, ఉపయోగము లేని జ్ఞానము కలవారగుదురు.

* మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్. 13

అర్జునా! మహాత్ములన్ననో, అట్లు కాదు. దైవీసంబంధమైన సాత్త్విక ప్రకృతి నాశ్రయించి వేరు చింతలు లేక మనస్సును అటు ఇటు చెదరనీయక సర్వభూతములకును సనాతన కారణమైనట్టియు, నాశము లేనట్టియు నన్ను భజించుచుందురు.

* సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. 14

దృఢాధ్యవసాయము కలిగిన మహాత్ములు నిరంతరమును నా నామములను, గుణములను, లీలలను సంకీర్తనము చేయుచు, నన్ను పొందుటకై ప్రయత్నము చేయుదురు. మాటిమాటికి నమస్కరించుచుందురు. ఈవిధముగా సతతము ధ్యానయుక్తమైన చిత్తముతో, అనన్యభక్తితో నన్ను ఉపాసించుచుందురు.

* జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్. 15

వీరు గాక, కొందరు జ్ఞానయజ్ఞముచే నన్ను పూజించి ఉపాసించుచున్నారు. ఏకత్వమున కొందరు, బహువిధములుగ కొందరు - ఇట్లనేక విధములుగ నన్నే భజించుచున్నారు.

* అహం క్రతు రహం యజ్ఞ స్స్వధాహ మహ మౌషధమ్
మంత్రోఽహ మహమే వాజ్య మహమగ్ని రహం హుతమ్. 16

జ్యోతిష్టోమాది రూపమైన క్రతువును నేనే. యజ్ఞమును నేనే. స్వధను నేనే. నేనే ఓషధివిశేషమైన హవిస్సును. మంత్రమును నేనే. ఘృతమును నేనే. అగ్నిని నేనే. హోమమును నేనే.

* పితాహ మస్య జగతో మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజురేవ చ. 17

ఈ సంపూర్ణ చరాచరాత్మకమైన జగత్తంతకును తండ్రిని, తల్లిని, తాతను, త్రాతను నేనే. తెలిసికొనదగినవాడను, పవిత్రమైన ఓంకారమును, ఋగ్వేదమును, సామవేదమును, యజుర్వేదమునుకూడ నేనే.

* గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్
ప్రభవః ప్రలయ స్థ్సానం నిధానం బీజ మవ్యయమ్. 18

ఈ జగత్తంతకును నేనే గతిని, భర్తను, ప్రభువును, సాక్షిని, నివసించు స్థానమును; అంతేకాదు, రక్షకుడను, మేలుకోరువాడను నేనే. ఈ జగత్తు పుట్టుటకును, లయమును పొందుటకును స్థానమును, నిధానమును, కారణమును అగు నేను అవ్యయుడను-నాశములేనివాడను.

* తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ
అమృతంచైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున ! 19

నేనే - సూర్యాగ్నిరూపములచే - తపింపజేయుచున్నాను. వర్షమును నిగ్రహించుటయు, వర్షింపజేయుటయు నేనే చేయుచున్నాను. అమృతమును నేనే - అనగా నన్ను పొందినవారు మరల జనన మరణ రూపమైన సంసారమున పడరు. మృత్యువును కూడ నేనే. సదసత్తులు రెండును నేనే.

* త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్. 20

త్రైవిద్యులు - అనగా ధర్మార్థ కామములనే పరమ పురుషార్థమని తలచి, పరమాత్మను వదలి, స్వర్గాది లోకముల నశ్వర భోగముల కొరకే ప్రయత్నించువారు - యజ్ఞముచే నన్నారాధించి సోమపానముచే పాపములు పోగొట్టుకొని, స్వర్గప్రాప్తికై అర్థించుచున్నారు. వారు వారి వారి పుణ్యమునకు ఫలరూపమైన స్వర్గాది లోకములను పొంది, అక్కడ దివ్యములగు దేవతా భోగములు అనుభవించుచున్నారు.

* తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే. 21

వారు సుసంపన్నములైన స్వర్గభోగముల ననుభవించి, తాము చేసిన పుణ్యము క్షయము కాగానే, మరల ఈ మర్త్యలోకమును పొందుచున్నారు. ఈ విధముగ స్వర్గాది కామములనే కోరు

వారీ త్రివర్గముల నాశ్రయించి స్వర్గమర్త్య లోకముల మధ్య రాకపోకలు చేయుచు, సంసారచక్రమున పరిభ్రమించుచున్నారు.

* అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. 22

కాని, అర్జునా ! నన్నే భజించుటయే పరమ ప్రయోజనముగ ఎంచి, చిత్తమును ఎక్కడికిని పోనీయక, నిత్యము నన్నే ధ్యానించుచు నన్నుపాసించువారియొక్క యోగక్షేమమును నేనే వహించుచున్నాను.

* యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః
తేఽపి మామేవ కౌంతేయ ! యజంత్యవిధిపూర్వకమ్. 23

శ్రద్ధతో ఇతర దేవతలను ఆరాధించువారుకూడ నన్నే పూజించుచున్నారు. కాని అర్జునా ! అది అవిధిపూర్వకమైనది - అనగా అజ్ఞానమూలకమైనది.

* అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ
న తు మా మభిజానంతి తత్త్వే నాతశ్చ్యవంతి తే. 24

ఏలయన, ఇతర దేవతల నుద్దేశించి చేయు సమస్త యజ్ఞములకును అనుభవించువాడను, ఫలప్రదాతను కూడ నేనే. వారికా యథార్థము తెలియదు. కాబట్టి, ఏయే దేవతలద్వారా నేనే ఆరాధింపబడుచున్నానో, ఆ యా దేవతలనే ఆరాధ్యులని తలచి, వారు నన్ను పొందుట అనెడి సత్యఫలమునుండి వంచింపబడుచున్నారు.

* యాంతి దేవవ్రతా దేవాన్
పితౄన్ యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా
యాంతి మద్యాజినో௨పి మామ్. 25

దేవతల నారాధించువారు దేవతలనే పొందుచున్నారు. పితృదేవతల నారాధించువారు పితృదేవతలనే పొందుచున్నారు. భూతముల నారాధించువారు భూతములనే పొందుచున్నారు. అట్లే నన్నారాధించువారును నన్నే పొందుచున్నారు.

* పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. 26

ఇంక, నన్ను పూజించుటలో ఎంత సౌలభ్యమున్నదో చూడుము- ఎవరైనను నాయందపరిమితమైన భక్తితో పత్రముగాని, పుష్పముగాని, ఇన్ని నీళ్ళుగాని ఇచ్చినయెడల కేవలము పరిశుద్ధ ప్రేమతో ఇచ్చిన ఆ పత్రపుష్పాదులను నే నెంతో ప్రేమ పూర్వకముగ అనుభవించుచున్నాను.

* యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్. 27

కనుక ఓ అర్జునా! నీవేది చేసెదవో, ఏమి భుజింతువో, ఏమి హోమము చేయుదువో, ఏమి దానము చేసెదవో, ఏ తపస్సు చేసెదవో - ఆ అన్నిటినికూడ, చేయుచున్నప్పుడు "శ్రీకృష్ణార్పణము" అని నాకే అర్పణము చేయుము.

* శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి. 28

ఈ విధముగా సన్న్యాస యోగముతో కూడిన చిత్తము కలిగి, సమస్త కర్మలను పరమాత్మనైన నాకే అర్పణ చేసినయెడల, శుభాశుభఫలరూప కర్మబంధములనుండి విముక్తినిబడసి, చివరకు నన్నే పొందగలవు.

* సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి నప్రియః
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.29

నా కందరును సమానులే. నా కొకరు ద్వేషింపదగినవారుగాని, ప్రియులుగాని లేరు. అనన్య భక్తితో నన్ను భజించుచున్నవారు నాయందున్నారు; నేను వారియందున్నాను.

* అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ స మంతవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః. 30

ఎంత దురాచారుడైనను, అనన్య భావముతో నాభక్తుడై నన్ను భజించు నెడల, వానిని సాధువనియే తలపవలయును. ఏలయన, అదివరకు చేసిన పాపములకు పశ్చాత్తాపపడి, ఇప్పుడు పరమాత్మనైన నాతో సమానమైన దేవియు లేదని దృఢ నిశ్చయము కలవాడై, అనన్యభక్తుడై యున్నాడు.

* క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి. 31

వాడు శీఘ్రముగనే ధర్మాత్ముడై శాశ్వతమైన శాంతిని పొందుచున్నాడు. ఓ అర్జునా! నా భక్తు డెన్నటికిని నశింపడని నీవు నిశ్చయముగ తెలిసికొనుము.

* మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాంగతిమ్.32

* కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్. 33

పార్థా ! స్త్రీలును, వైశ్యులును, శూద్రులును, ఇంకను పాప జన్మలైన చండాలాదులును - ఎవరైనను సరే, నన్ను శరణు పొందిన యెడల, వారలకు పరమగతి దొరకుచున్నది. ఇంక పుణ్యశీలురును, భక్తులును అగు బ్రాహ్మణులును, రాజర్షులును అట్లు పరమగతికి పోదురని వేరుగ చెప్పవలయునా ! సందేహము లేదు. కాబట్టి సుఖరహితమైనట్టియు, అనిత్యమైనట్టియు ఈ మర్త్యలోకమును పొందిన నీవు పునరావృత్తిరహితమైన పరమపదమిచ్చి నన్ను భజించుము.

* మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. 34

అర్జునా ! చిత్తమును నాయందే లగ్నముచేసి ఉంచుము; నా భక్తుడవు కమ్ము; నన్నే పూజించుచుండుము; నాకు నమస్కరించుచుండుము. ఈ విధముగ మనస్సును నాయందే ఉంచి, నన్నే పరమగతిగ తలచిన యెడల నన్నే పొందగలవు.

ఓం తత్సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే రాజవిద్యా రాజగుహ్య
యోగోనామ నవమోఽధ్యాయః

ఓం శ్రియఃపతయేనమః
ఓం శ్రీపరమాత్మనేనమః

# శ్రీ గీ తా మృ త ము

## దశమాధ్యాయము - విభూతియోగము

శ్రీ భ గ వా ను వా చ :

* భూయ ఏవ మహాబాహో! శృణు మే పరమం వచః
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా. 1

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

మహాబాహువులైన ఓ అర్జునా! నాయందు అపరిమిత ప్రేమ కలిగిన నీ యొక్క హితమును కోరి పరమ రహస్యమును మరల చెప్పుచున్నాను వినుము.

* న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. 2

నా ప్రభావమును బ్రహ్మాది దేవతలు, మహర్షులు సైతము మూలముట్టుగ తెలియలేరు. అన్ని విధముల చేతను దేవతలకును, మహర్షులకును కూడ నేనే ఆదికారణమునై యున్నాను.

* యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. 3

నన్ను కర్మమూలకమైన పుట్టుక లేనివానినిగను, సనాతనునిగను, లోకముల కీశ్వరులైన బ్రహ్మేంద్రాదులకు కూడ ఈశ్వరుడగు మహేశ్వరునిగను తెలిసికొనువాడు మానవులందరిలోను జ్ఞాన

వంతుడు. అతడు సర్వపాపములనుండియు విడివడి పరిశుద్ధుడగు చున్నాడు.

* బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయ మేవ చ　　4

* అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః.　　5

బుద్ధి, జ్ఞానము, మోహములేమి, ఓర్పు, సత్యము, దమము, శమము, సుఖము, దుఃఖము, ఉత్పత్తి, ప్రళయము, భయము, అభయము, అహింస, సమత్వము, సంతోషము, తపము, దానము, కీర్తి, అపకీర్తి - ఇత్యాదిగ నానావిధములైన మనో వ్యాపారములును సకల ప్రాణులకును నావలనే కలుగుచున్నవి.

* మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః 6

ఈ లోకమంతయు ఎవరి సంతానమో, అట్టి మరీచి అంగిరా అత్రి పులస్త్య పులహ క్రతు వసిష్ఠులను సప్తర్షులును, వారి కంటె పూర్వులు సనక సనందన సనాతన సనత్కుమారులు నలువురును, స్వాయంభువ స్వారోచిష ఉత్తమ తామస రైవత చాక్షుష వైవస్వత సావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి ధర్మ సావర్ణి రుద్రసావర్ణి దేవసావర్ణి ఇంద్రసావర్ణి అను పదునలుగురు మనువులును నాయందు భావము కలవారును, నా సంకల్పము చేతనే కలిగిన వారును అయి ఉన్నారు.

* ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః　　7

నా. ఈ పరమైశ్వర్యరూప విభూతిని, యోగశక్తిని కూడ యథార్థరూపమున తెలిసికొనుచున్నవాడు చలించని భక్తి యోగము కలవాడగుచున్నాడు - ఇంతమాత్రమును సందేహము లేదు.

* అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః. 8

పరమాత్మనైన నేనే, ఈ సంపూర్ణ జగత్తుయొక్క ఉత్పత్తికి మూలకారణమును. నావలననే ఈ జగద్వ్యాపార మంతయును జరుగుచున్నది. ఈ విషయమును తెలిసికొని బుద్ధిమంతులైన నా భక్తజనులు నిరంతరము నన్ను భజించుచుందురు.

* మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్
కథయంతశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమంతి చ. 9

చిత్తమును నాయందే అర్పించినట్టియు, నన్నే జీవనాధారముగ కలిగినట్టియు - అనగా నన్ను ధ్యానించుటకొక్క క్షణ మాటంకము కలిగిన యెడల ప్రాణములు నిలువని స్థితిలో ఉన్న - భక్తపుంగవులు నన్ను గూర్చి పరస్పరము బోధించుకొనుచు, నాకు సంబంధించిన లీలలను, గుణములను, కథలను చెప్పుకొనుచు, సంతుష్టి కలవారై నిరంతరముగ నాయందే క్రీడించుచుందురు.

* తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే. 10

ఆ విధముగ నిరంతరముగ నాయందే ధ్యానము కలిగి, మిక్కిలి ప్రేమతో నన్ను భజించువారికి యథార్థ స్వరూపమును తెలిసికొనుటకు తగిన బుద్ధిని నేనే ఇచ్చుచున్నాను.

* తేషా మే వానుకంపార్థ మహ మజ్ఞానజం తమః
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. 11

కేవలము వారియందనుగ్రహము చేతనే వారియం దంతర్యామిగ వ్యాపించియున్న నేను, అవతారముల యొక్కయు, లీలారూపము లగు కర్మయొక్కయు యాథార్థ్యమును తెలిసికొనలేకపోవుట అను అజ్ఞానమువలన కలిగిన చీకటిని, మిక్కిలి ప్రకాశించుచున్న జ్ఞానమను దీపముచే నశింపచేయుచున్నాను.

అర్జున ఉవాచ :

* పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్. 12

* ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే. 13

అర్జునుడు అడుగుచున్నాడు :

పరమధామమును, పరమ పవిత్రమును, సనాతనమును దివ్యమును అయిన తత్త్వము నీవే. నీవే ఆదిపురుషుడవును, ఆది దేవుడవును, అజుడవును, విభుడవును అయి ఉన్నావు. ఈ విషయమును దేవర్షియైన నారదుడును, అసితుడును, దేవలుడును, వ్యాసుడును మొదలగు ఋషులందరును చెప్పిరి. అంతేగాక స్వయముగా నీవుకూడ నాకు చెప్పితివి.

* సర్వ మేత దృతం మన్యే య న్మాం వదసి కేశవ !
నహి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా న దానవాః. 14

ఓ కృష్ణా ! నీవు నాకు చెప్పిన ఈ సర్వమును సత్యమని నమ్ముచున్నాను. నీ స్వరూపమును దానవులుగాని, దేవతలుగాని తెలియలేరు.

* స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ !
భూతభావన ! భూతేశ ! దేవదేవ ! జగత్పతే ! 15

ఓ పురుషోత్తమా ! సర్వభూతములను సృష్టించువాడా ! సర్వభూతముల కీశ్వరుడా ! దేవతలకు కూడ దేవుడైనవాడా ! హే జగత్పతే ! నిన్ను నీవే తెలిసికొనగలవు. నీ యథార్థమును ఎవరును తెలిసికొనలేరు.

* వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి. 16

కాబట్టి ఏయే విభూతుల ద్వారమున ఈ సమస్తలోకములలోను వ్యాపించి ఉన్నావో, అట్టి నీ దివ్యవిభూతులను సంపూర్ణముగ చెప్పుటకు నీవే సమర్థుడవు.

* కథం విద్యా మహం యోగిం స్త్వాం సదా పరిచింతయన్
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవ న్మయా. 17

హే భగవన్ ! నే నేవిధమున ధ్యానించుకొనిన యెడల నిన్ను తెలిసికొనగలుగుదును ? ఏయే పదార్థములయందు నిన్ను చింతించుట తగిఉండును ?

* విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన !
భూయః కథయ తృప్తి ర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్. 18

ఓ జనార్దనా! నీయొక్క యోగశక్తిని, విభూతిని మరల వివరించి చెప్పుము. అమృతమువంటి నీ మాహాత్మ్యము నెంతవినుచున్నను నాకు తృప్తి కలుగుటలేదు సరికదా, వినినకొలది ఇంకను వినవలయుననియే ఆశ కలుగుచున్నది.

శ్రీ భ గ వా ను వా చ :

* హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ ! నా స్త్యంతో విస్తరస్య మే. 19

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

అర్జునా ! ఈ జిజ్ఞాసవలననే నీవు కురువంశమందలి వారిలో శ్రేష్ఠుడవైతివి. ఇక వినుము - నేను సర్వపదార్థములయందును వ్యాపించియున్నాను. నా విభూతుల కంతములేదు. కాని, వేని యందు నాయొక్క తేజము, బలము, విద్య, ఐశ్వర్యము, కాంతి, శక్తి, విశేషముగ ఉన్నవో, అట్టి ప్రధాన విభూతులను చెప్పుచున్నాను.

* అహ మాత్మా గుడాకేశ ! సర్వభూతాశయస్థితః
అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మంత ఏవ చ. 20

అర్జునా ! సర్వభూతములయొక్క హృదయ కమలములందున్న జీవాత్మ స్వరూపుడను నేనే. సర్వ భూతములు నాయందే పుట్టుచున్నవి. నాయందే రక్షణమును పొందుచున్నవి. నాయందే లయించుచున్నవి. కాబట్టి, వాటికి ఆదిమధ్యాంతములు నేనే.

* ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ. 21

అదితి కుమారులైన ధాత మిత్ర అర్యమా ఇంద్ర వరుణ అంశ భగ వివస్వాన్ పూషా సవితా త్వష్టా విష్ణు - అను పండ్రెండుగురు ఆదిత్యులలో నేను విష్ణువును. ప్రకాశముగల పదార్థములలో సూర్యుడను నేను, మరుత్తులలో మరీచిని నేనే. నక్షత్రములలో వాటికి రాజైన చంద్రుడను నేను.

* వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః
ఇంద్రియాణాం మన శ్చాస్మి భూతానా మస్మి చేతనా. 22

వేదములలో సామవేదమును, దేవతలలో ఇంద్రుడను, ఇంద్రియములలో మనస్సును, భూతములందు గల చైతన్యమును నేనే.

* రుద్రాణాం శంకర శ్చాస్మి వి త్తేశో యక్ష రక్షసామ్
వసూనాం పావక శ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్. 23

హరుడు, బహురూపుడు, త్రియంబకుడు, అపరాజితుడు, వృషాకపి, శంకరుడు, కపర్ది, రైవతుడు, మృగవ్యాధుడు, శర్వుడు, కపాలి అను పదునొకండుగురు రుద్రులలో శంకరుడను నేను. యక్షులలోను రాక్షసులలోను కుబేరుడను. ధరుడు, ధ్రువుడు, సోముడు, ఆహుడు, అనిలుడు, అగ్ని, ప్రత్యూషుడు, ప్రభాసుడు అను ఎనమండుగురు వసువులలో అగ్నిని నేను. పర్వతములలో మేరు పర్వతమును నేను.

* పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్
సేనానీనా మహం స్కంద స్సరసా మస్మి సాగరః. 24

పురోహితులలో ముఖ్యుడైన బృహస్పతిని నేను. సేనాపతులలో కుమారస్వామిని నేను. సరస్సులలో సముద్రమును నేను.

* మహర్షీణాం భృగు రహం గిరా మ స్మ్యేక మక్షరమ్
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః. 25

మహర్షులలో భృగువును నేను. శబ్దములలో ఏకాక్షరమను పేరు గల ప్రణవమును నేను. యజ్ఞములందు జపయజ్ఞమును నేను. స్థిరమైనవాటిలో హిమాలయమును నేను.

* అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః
గన్ధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః. 26

వృక్షము లన్నిటిలో అశ్వత్థమును - అనగా రావిచెట్టును - నేను. దేవర్షులలో నారదుడను నేను. గంధర్వులలో చిత్రరథుడను నేను. సిద్ధులలో కపిలమునిని నేను.

* ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాంచ నరాధిపమ్. 27

గుఱ్ఱములలో పాలసముద్రములో పుట్టిన ఉచ్చైశ్శ్రవమును నేను. దిగ్గజములలో ఐరావతమును నేను. మానవులలో రాజును నేను.

* ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్
ప్రజన శ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః. 28

ఆయుధములలో వజ్రమును, ఆవులలో కామధేనువును. సంతానోత్పత్తికి కారణమైన మన్మథుడను నేనే అని తెలిసికొనుము. సర్పములందు వాసుకిని నేను.

* అనన్త శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్.29

నాగులయం దాది శేషుడను నేను. జలదేవతలలో వరుణుడను నేను. పితృదేవతలయం దర్యముడను వాడను నేను. శాసించెడి వారిలో యముడను నేను.

* ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్
మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్.30

దైత్యులలో ప్రహ్లాదుడను నేను. గుణించువారలలో కాలమును నేను. మృగములలో సింహమును నేను. పక్షులలో గరుత్మంతుడను నేను.

* పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహమ్
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ. 31

పవిత్రము చేయువారలలో వాయువును నేను. శస్త్రములు ధరించినవారిలో శ్రీరామచంద్రమూర్తిని నేను. జలజంతువులలో మొసలిని నేను. నదులలో గంగానదిని నేను.

* సర్గాణా మాది రంతశ్చ మధ్యం చైవాహ మర్జున!
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్. 32

సృష్టింపబడినవాటికి ఆదిమధ్యాంతములు నేనే. అర్జునా! విద్యలలో అధ్యాత్మవిద్య - అనగా బ్రహ్మవిద్య - నేను. తత్త్వనిర్ణయముకొరకు వాదము చేయువారి వాదమును నేను.

* అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్య చ
అహమే వాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః. 33

అక్షరములలో అకారమును నేను. సమాసములలో ద్వంద్వసమాసమును నేను. అక్షయకాలమును నేను. చతుర్ముఖ బ్రహ్మను నేను.

* మృత్యు స్సర్వహర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్
కీర్తి శ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా. 34

సర్వమును నాశనముచేయు మృత్యువును నేను. ముందు పుట్టగల వారి ఉత్పత్తిని నేను. స్త్రీలలో శ్రీ, కీర్తి, వాక్కు, స్మృతి, మేధా, ధృతి, క్షమ- ఈ అందరును నేను.

* బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహమ్
మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః. 35

గానము చేయదగిన శ్రుతులలో బృహత్సామమును నేను. ఛందస్సులలో గాయత్రిని నేను. మాసములలో మార్గశిరమాసమును నేను. ఋతువులలో వసంతఋతువును నేను.

* ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతా మహమ్. 36

మోసగాండ్రలోని ద్యూతమును, తేజస్వంతులలోని తేజస్సును నేను జయమును నేను. ప్రయత్నమును నేను. సాత్త్విక పురుషుల యొక్క మనస్సును నేను.

* వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః
మునీనా మ ప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః. 37

యాదవులలో వాసుదేవుడను నేను. పాండవులలో ధనంజయుడను నేను. మునులలో వేదవ్యాసుడను నేను. కవులలో శుక్రాచార్యుడను నేను.

* దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్. 38

శిక్షించువారలలోని శిక్షణశక్తిని నేను. జయించగోరువారి యొక్క నీతిని నేను. రహస్యములకు రక్షకమైన మౌనమును నేను. జ్ఞానవంతులయందు తత్త్వజ్ఞానమును నేను.

* యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున !
న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్. 39

అర్జునా ! సర్వభూతములకును ఉత్పత్తి కారణమును నేను. చరాచర సమస్త జగత్తునందును నేను లేని దేదియును లేదు.

* నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప !
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. 40

అర్జునా! దివ్యములైన నా విభూతులకు అంతములేదు. నేను నీకు చెప్పిన నా విభూతులయొక్క విస్తార మనిపించు ఈ వివరణము కూడ సంక్షిప్తమే.

* య ద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా
త త్త దే వావగచ్ఛ త్వం మమ తేజోంశ సంభవమ్. 41

జగత్తునందు ఏ యే పదార్థము లైశ్వర్యముతోను, కాంతితోను, శక్తితోను కూడియుండునో, ఆ యా పదార్థములెల్ల నా యొక్క తేజస్సులోని స్వల్పభాగము వలన కలిగినవని తెలిసికొనుము.

* అథవా బహు నై తేన కిం జ్ఞాతేన త వార్జున !
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. 42

పార్థా! ఎంత విస్తారముగ చెప్పినను నీకేమి ప్రయోజనము - అనగా ఎంత తెలిసినట్లు ? నే నీ సంపూర్ణ జగత్తును నా యొక్క యోగశక్తిలోని బహుస్వల్పభాగముచేతనే నిలబెట్టియుంటిని. నా మహిమను ఆలోచించుము !

ఓం తత్ సత్.

ఇతి శ్రీమ ద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విభూతియోగో నామ
దశమోఽధ్యాయః

ఓం శ్రియఃపతయేనమః
ఓం శ్రీపరమాత్మనేనమః

# శ్రీ గీతామృతము

## ఏకాదశాధ్యాయము — విశ్వరూపసందర్శనయోగము

అర్జున ఉవాచ :

* మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. 1

అర్జునుడు అడుగుచున్నాడు :

కృష్ణా ! నన్నను గ్రహించుటకు అతిరహస్యమైన అధ్యాత్మ విషయమును ఉపదేశించి ఉన్నావు. దానిచే నాకు కలిగిన మోహము తొలగిపోయినది.

* భవాప్యయౌహి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా
త్వత్తః కమలపత్రాక్ష ! మాహాత్మ్య మపి చావ్యయమ్ .2

కమలపత్రాక్షా! నీవలన సమస్తభూతములకును కలిగెడి ఉత్పత్తి వినాశములు విస్తారముగ వింటిని. నీ యొక్క అపరిమితమైన ట్టియు, నిత్యమైనట్టియు మాహాత్మ్యమును కూడ కర్ణానందముగ వింటిని.

* ఏవ మేత ద్యథాత్థ త్వ మాత్మానం పరమేశ్వర !
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ ! 3

పురుషోత్తమా! పరమేశ్వరా! నీవు నిన్నుగూర్చి చెప్పిన దంతయును సత్యమని నమ్మితిని. కాని, దయాస్వరూపా ! జ్ఞాన బల ఐశ్వర్య శక్తి వీర్య తేజములతో కూడుకొన్న నీ స్వరూపమును చూడ ఇచ్ఛగించుచున్నాను.

* మన్యసే యది త చ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో !
యోగేశ్వర ! తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్. 4

ఓ ప్రభూ ! యోగేశ్వరా ! నేను చూచుటకు తగుదునని నీవు తలంచిన, ఆ నీ అవ్యయరూపమును చూపుము.

శ్రీ భ గ వా ను వా చ :

* పశ్య మే పార్థ ! రూపాణి శతశోఽథ సహస్రశః
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. 5

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

పార్థా ! చూడుము. నానావిధములైనట్టియు, నానావర్ణములు కలిగినట్టియు, నానా ఆకారములు కలిగినట్టియు, నూర్లకొలదియు వేలకొలదియు నైన నా అప్రాకృత రూపములను చూడుము.

* పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ! 6

అర్జునా ! నాయందు ద్వాదశాదిత్యులను, అష్టవసువులను, ఏకాదశరుద్రులను, అశ్వినీకుమార ద్వయమును, నలుబది తొమ్మండుగురు మరుత్తులను చూడుము. ఇంకను, అదివర కెన్నడును కనివినియెరుగని అనేకాద్భుతరూపములను చూడుము.

* ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్
మను దేహే గుడాకేశ ! య చ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి. 7

అర్జునా ! నా ఈ దేహమునందు అతిస్వల్పభాగమైన ఒక్క ప్రదేశమందే ఉన్న చరాచరమైన సకల జగత్తును చూడుము. ఇంకను ఏమి చూడగోరెదవో ఇప్పుడే చూడుము.

* న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్. 8

కాని, నీ ఈ ప్రాకృత నేత్రములతో నన్ను చూడలేవు సుమా ! ఇదిగో నీకు దివ్యదృష్టి నిచ్చుచున్నాను. ఇప్పుడు మహామహిమ కలిగిన, ఈశ్వరీయమైన నా యోగశక్తిని చూడుము.

సంజయ ఉవాచ :

* ఏవ ముక్త్వా తతో రాజన్ ! మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్. 9

సంజయుడు చెప్పుచున్నాడు :

ధృతరాష్ట్ర మహారాజా ! మహాయోగేశ్వరు డైనట్టియు, తనాశ్రయించిన భక్తుల పాపములు నశింపజేయునట్టియు, కృష్ణ పరమాత్మ ఈవిధముగ పలికి, అర్జునునకు ఐశ్వర్యముతో కూడిన తన దివ్యస్వరూపమును చూపెను.

* అనేకవక్త్ర నయన మనేకాద్భుత దర్శనమ్
అనేక దివ్యాభరణం దివ్యా నేకోద్యతాయుధమ్. 10

* దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్. 11

రాజా ! ఏమని చెప్పుదును ! ఆ రూపము అనేక ముఖములు, అనేక నేత్రములు, అనేకములైన అద్భుత దర్శనములు కలిగి యున్నది. అనేక దివ్యాభరణములతో అలంకరింపబడియున్నది. దివ్యములైన అనేకాయుధములు ధరించి, చేతులు పైకెత్తుకొని ఉన్నది. దివ్యములైన మాలల చేతను, వస్త్రముల చేతను ఒప్పుచున్నది. దివ్యగంధము పూయబడి ఉన్నది. ఎంతని వర్ణించను రాజా ! సర్వాశ్చర్యముగ ఉన్నది. ఎక్కడ చూచినను

అంతము కనబడుటలేదు. ప్రతిచోటను ఆయన ముఖములే ఉన్నవి.

* దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా
యది భాః సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః. 12

ఆకాశమందు వేయి సూర్యులొక్కసారి ఉదయించిన ఎట్టి ప్రకాశము కలుగునో, ఆ ప్రకాశము కూడ ఆ మహాత్ముని ప్రకాశమునకు సమానమగునా !

* తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా. 13

అప్పుడర్జునుడనేక విధములుగ విభజింపబడియున్న సకలజగత్తును కూడ, దేవదేవుడైన కృష్ణపరమాత్మయొక్క శరీరమునందలి అల్పభాగముననే చూచెను -

* తతస్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలిరభాషత. 14

ప్రకాశమయమైన ఇట్టి విశ్వరూపమును చూచునప్పటికి అర్జునునకు పరమాశ్చర్యము కలిగినది. శరీరమంతయు పులకరించినది. శ్రద్ధా భక్తులతో పరమాత్మకు సాష్టాంగ నమస్కారముచేసి, కరములు జోడించి పలుకుచున్నాడు -

అర్జున ఉవాచ :

* పశ్యామి దేవాంస్తవ దేవ దేహే
సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్
బ్రహ్మాణమీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్. 15

అర్జునుడు పలుకుచున్నాడు :

ఓ పరమాత్మా ! నీ శరీరమందు సకల దేవతలను, అనేకములైన భూతసముదాయములను, కమలాసనముపై విరాజిల్లుచున్న బ్రహ్మను, మహాదేవుడైన శంకరుని, సకల ఋషిసంఘములను, దేవతాసర్పములను చూచుచున్నాను.

* అనేక బాహూదర వక్త్ర నేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్
నాన్తం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర ! విశ్వరూప ! 16

ఓ విశ్వేశ్వరా ! విశ్వరూపా ! అనేకములైన బాహువులును, ఉదరములును, ముఖములును, నేత్రములును గలట్టియు, సర్వత్ర వ్యాపించియున్నట్టియు, అనంతములైన రూపములు కలట్టియు నిన్ను చూచుచున్నాను. ఆ నీ స్వరూపమునకు ఆదిగాని, మధ్యము గాని, అంతముగాని లేకున్నది.

* కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా
ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్. 17

నీ శిరోభాగమున శోభాయమానమైన కిరీటమున్నది. హస్తమందు గద ఉన్నది; చక్రమున్నది. నీవు తేజోరాశివి. సర్వత్ర ప్రకాశించుచున్నావు. బాగుగ ప్రజ్వలించుచున్న సూర్యాగ్నులవలె జ్వాలలు కలవాడవు. ఏ ఉపాయముచేతను నిన్ను పరిపూర్ణముగ తెలిసికొనుటకు శక్యము గాదు. ఒక్క సూర్యునే, చూడలేమన్నచో. వేయిసూర్యుల కాంతికి మించియున్న నిన్నెట్లు చూడగలము ? కాని దేవా ! నీ అనుగ్రహముచే ఇట్టి నిన్ను చూచుచున్నాను.

* త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్
త్వ మవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే. 18

అక్షరస్వరూపుడవైన పరమాత్మవు నీవు. ముముక్షువులు తెలిసికొనవలసినవాడవు నీవే. విశ్వమున కంతకును నీవే ఆధారమైన వాడవు. వికార రహితుడవు. శాశ్వత ధర్మరక్షకుడవు, సనాతనుడవైన పురుషోత్తముడవు నీవే.

* అనాది మధ్యాంత మనంతవీర్య
మనంతబాహుం శశిసూర్యనేత్రమ్
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వ మిదం తపంతమ్. 19

మహానుభావా ! నిన్ను తెలిసికొన్నాను. ఆదిమధ్యాంతములు లేనివాడవు. అపరిమిత సామర్థ్యము కలవాడవు. అనంతములైన బాహువులు కలవాడవు. సూర్యచంద్రులే నీకు నేత్రములు. బాగుగ మండుచున్న అగ్నినుండివలె, నీముఖములనుండి జ్వాలలు బయలువెడలుచున్నవి. నీయొక్క తేజముచే ఈ జగత్తంతయు తపించిపోవుచున్నది. ఇట్టి నిన్ను చూచుచున్నాను.

* ద్యావా పృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వ యైకేన దిశశ్చ సర్వాః
దృష్ట్వాద్భుతం రూప ముగ్రం త వేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ! 20

స్వర్గమునకును భూమికిని మధ్యనున్న ప్రదేశమంతయు నీ ఒక్కనిచేతనే వ్యాప్తమై ఉన్నది. మహాత్మా ! ఆశ్చర్యమును, భయ

మును కూడ కలిగించు నీ ఈ రూపమును చూచి ముల్లోకములును తల్లడిల్లిపోవుచున్నవి.

* అమీ హి త్వాం సురసంఘా విశంతి
కేచి ద్భీతాః ప్రాంజలయో గృణంతి
స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధ సంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః. 21

ఈ దేవతా సమూహమంతయు నీలో ప్రవేశించుచున్నది. కొంత మంది భయముతో, చేతులు జోడించి నిన్ను ప్రార్థించుచున్నారు. మహర్షులును, సిద్ధులును గుంపులు గుంపులుగ చేరి స్వస్తివాచక ములచేతను, స్తోత్రపాఠములచేతను నిన్ను స్తుతిచేయుచున్నారు.

* రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ
గంధర్వ యక్షాసుర సిద్ధ సంఘా
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే. 22

రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినీకుమారులు, మరుద్గణము, పితృదేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, సిద్ధసమూహము - వీరందరును నిన్ను అత్యాశ్చర్యముగ చూచుచున్నారు.

* రూపం మహత్తే బహువక్త్ర నేత్రం
మహాబాహో! బహుబాహూరు పాదమ్
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాహమ్. 23

అనేకములైన ముఖములును, నేత్రములును, కలిగినట్టియు, అనేకములైన చేతులును, తొడలును, పాదములును కలిగినట్టియు,

అనేకములైన ఉదరములు కలిగినట్టియు, అనేకములైన కోరలు కలిగినట్టియు, భయంకరమైన నీ మహారూపమును చూచి, లోకములన్నియును భయమ్ముచే కంపించిపోవుచున్నవి. నేనుకూడ భయముచే నిలువలేకున్నాను.

* నభస్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్త విశాలనేత్రమ్
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితా న్తరాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో! 24

హే విష్ణో! నీ వాకాశమున కంటుచున్నావు. దేదీప్యమానముగ వెలిగిపోవుచున్నావు. అనేకములైన వర్ణములు కలిగియున్నావు. నీ నోళ్ళన్నియును బాగుగ తెరువబడియున్నవి. విశాలములై ప్రకాశించుచున్న నేత్రములు కలవాడవు. ఇట్టి రూపముకల నిన్ను చూచుటవలన భయముచే నా హృదయము బ్రద్దలైపోవుచున్నది. ధైర్యమును, శాంతినికూడ నిలుపుకొనజాలకున్నాను.

* దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ! జగన్నివాస! 25

బ్రహ్మ రుద్రేంద్రాదులకుకూడ అధిపతివైన ఓ ప్రభూ! పెద్ద పెద్ద కోరలచే భయంకరమైనట్టియు, ప్రళయకాలమందలి అగ్ని వలె మండుచున్నట్టియు నీ ముఖములను చూచినంతనే, నాకు భయముచే దిక్కులు తెలియుటలేదు. సుఖములేదు. హేజగన్నివాసా! నాపై అనుగ్రహముంచి ప్రసన్నుడవు కమ్ము.

* అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రా
స్సర్వే సహైవావనిపాలసంఘైః
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః. 26

* వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రా కరాళాని భయానకాని
కేచి ద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః. 27

సకలరాజన్యులతోడను, ధృతరాష్ట్రుని కుమారులైన దుర్యోధనాదు లందరును, భీష్ముడును, ద్రోణాచార్యుడును, కర్ణుడును - అంతేకాదు, మా పక్షమందలి వీరశ్రేష్ఠులందరును కూడ భయంకరమైన కోరలుగల నీ ముఖములందు అతివేగముగ ప్రవేశించుచున్నారు. కొందరు ఆ కోరల సందున చిక్కుకొని, ముక్కలుముక్కలుగ బ్రద్దలైన తలలతో కనబడుచున్నారు.

* యథా నదీనాం బహవోఽంబువేగా
స్సముద్ర మేవాభిముఖా ద్రవంతి
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి. 28

* యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయ సమృద్ధవేగాః
తథైవ నాశాయ విశంతి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః. 29

దేవాదిదేవా ! నదులయందలి నీరంతయు అతివేగముతో ప్రవహించుచు, సముద్రమున ప్రవేశించుచున్నట్లు, మండుచున్న

నిప్పులోనికి తమ నాశనముకొరకై మిడుతలు పరుగెత్తుకొని వచ్చునట్లు, ఈ మానవవీరు లందరును బాగుగ మండుచు జ్వాలలు గ్రక్కుచున్న భయంకరమైన నీ ముఖములందు ప్రవే శించి నశించుచున్నారు.

* లేలిహ్యసే గ్రసమాన స్సమంతా
ల్లోకాన్ సమగ్రాన్ వదనై ర్జ్వలద్భిః
తేజోభి రాపూర్య జగ త్సమగ్రం
భాస స్తవోగ్రాః ప్రతపంతి విష్ణో! 30

హే విష్ణో! భగభగ మండుచున్న నీ ముఖములచే ఈ రాజుల నందరను మ్రింగి, కోపముచే అగ్నివైపులకు నాలుకలు జాపి నాకివేయుచు, భయంకరముగ నీ తేజము జగత్తున నింపి తపింప జేయుచున్నావు.

* ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర! ప్రసీద
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్. 31

ఓ దేవేశా! ఇంత ఉగ్రరూపము దాల్చిన నీ వెవడవు? ఏమి చేయదలచుకొన్నావు? నాకేమియు తెలియుటలేదు. నీ అభి ప్రాయ మేమో తెలిసికొన గోరుచున్నాను. నీకు నమస్కారము! నాయందనుగ్రహము ఉంచుము!

శ్రీ భగవానువాచ :

* కాలోఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 32

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

అర్జునా ! చెప్పుచున్నాను వినుము. నేను లోకములను నాశము చేయు మహాకాలస్వరూపుడను. ఇప్పు డీ రాజలోకము నంతను నాశము చేయుటకై సంకల్పించి వచ్చితిని. శత్రుసైన్యమందలి భీష్మ ద్రోణాది వీరులందరును నీవు యుద్ధము చేయకపోయినను నశించిపోవువారే.

* తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూ న్భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్
మయై వై తే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ! 33

కనుక, లెమ్ము ! ఆ కీర్తిని నీవే పొందుము. శత్రు సైన్యములను జయించి ధన ధాన్య సమృద్ధమైన రాజ్యము ననుభవించుము. వీ రందరును ముందే నాచేత చంపబడినవారు. కేవలము నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము.

* ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ
కర్ణం త థాన్యా నపి యోధవీరాన్
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్. 34

నాచేతనే చంపబడిన ద్రోణుని, భీష్ముడు, సైంధవుడు, కర్ణుడు మొదలగు వీరుల నందరను నీవు చంపుము. భయ పడకుము. యుద్ధమునందు శత్రువులను జయించగలవు. సందేహము లేదు. యుద్ధము చేయుము.

సంజయ ఉవాచ :

* ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య. 35

సంజయుడు చెప్పుచున్నాడు :

కృష్ణపరమాత్మ ఇట్లు చెప్పగ విని, అర్జునుడు వణకుచు చేతులు జోడించి, నమస్కారము చేసి, అత్యంత భయముతో మరల మరల నమస్కారములు చేయుచు, గద్గదకంఠుడై పరమాత్మతో ఇట్లు పలికెను.

అర్జున ఉవాచ :

* స్థానే హృషీకేశ ! తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్య త్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః. 36

అర్జునుడు చెప్పుచున్నాడు :

కృష్ణా ! నీవు చెప్పినది సత్యమే. నీయొక్క నామ గుణ ప్రభావముల కీర్తనచే జగము చాల సంతోషించుచున్నది. ప్రేమను గూడ పొందుచున్నది. భయముచే రాక్షసు లందరును దిక్కులకు పరుగులెత్తుచున్నారు. సిద్ధసమూహమంతయు నీకు నమస్కరించుచున్నది.

* కస్మాచ్చ తే న నమేర న్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే
అనంత ! దేవేశ ! జగన్నివాస !
త్వ మక్షరం సదస త్తత్పరం యత్. 37

హే భగవన్ ! నీవు బ్రహ్మకు కూడ ఆదికారణమైనవాడవు. అందరికంటెను చాల గొప్పవాడవు. వీరందరు నీకు నమస్కరించుచున్నారనగ ఆశ్చర్యమేమున్నది ! అనంతా ! దేవేశా ! జగన్నివాసా ! ఆత్మవు నీవే, ప్రకృతివి నీవే - వీటికి పరమైన పరబ్రహ్మతత్త్వమును నీవే.

* త్వమాదిదేవః పురుషః పురాణ
స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్
వేత్తాసి వేద్యం చ పరంచ ధామ
త్వయా తతం విశ్వమనంతరూప ! 38

అనంతరూపా! నీవు ఆదిదేవుడవు. సనాతన పురుషుడవు. జగత్తంతకును నీవే పరమాధారము. తెలియదగినవాడవు నీవే. తెలిసికొనువాడవును నీవే. పరమపదస్థానముకు నీవే. నీచేత ఈ విశ్వమంతయు వ్యాప్తమై ఉన్నది.

* వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాంకః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ
నమోనమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే. 39

వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, ప్రజాపతి - అందరును నీవే. పితామహుడగు బ్రహ్మకును తండ్రియైన నారాయణుడవు నీవు. నీకు వేలకొలది నమస్కారములు ! నమస్కారములు! నీకు మరల మరల మాటిమాటికి నమస్కారములు! నమస్కారములు !

* నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ
అనంతవీర్యామితవిక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః. 40

అపరిమిత సామర్థ్యము కలిగిన పరమాత్మా! నీకు-ఎదుటిభాగము నకు నమస్కారములు. వెనుక భాగమునకు నమస్కారములు. నీకు అన్ని దిక్కులయందును నమస్కారములు. నీవు సమస్త జగత్తును ఆవరించి ఉన్నావు. కనుక సమస్తమును నీవే అనదగి ఉన్నావు.

* సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి. 41

* యచ్చావహాసార్థ మసత్కృతోఽసి
విహార శయ్యాసన భోజనేషు
ఏకోఽథవా ప్యచ్యుత! తత్సమక్షం
తత్క్షామయే త్వా మహ మప్రమేయమ్. 42

పరమ దయానిధీ! నీ శక్తి నీ ప్రభావము తెలియక నీవు నా స్నేహితుడవే అని తలచితిని. ఆ కారణమున, ప్రేమచేతను, పొరపాటుచేతను కూడ నిన్ను, "ఓ కృష్ణా! ఓ యాదవా! ఓ స్నేహితుడా!" అని ఈ విధముగ పిలిచితిని. ఓ అచ్యుతా! నీతో తిరుగునప్పుడుగాని, పరున్నప్పుడుగాని, కూర్చొన్నప్పుడు గాని, భోజనసమయమునందుగాని, ఏకాంతమునందుగాని, మిత్రుల ఎదుట గాని - పరిహాసము కొరకు ఏమేమి అపరాధములు, చేసితినో, అప్రమేయా! వాటి నన్నిటిని క్షమింప వేడుకొను చున్నాను.

* పితాసి లోకస్య చరాచరస్య
త్వ మస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్
న త్వత్సమోఽ స్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ! 43

ఈ సమస్త చరాచర లోకములకును నీవే తండ్రివి. అందరికంటెను గొప్పవాడవును, పూజ్యుడవును, గురువును నీవే. అసమానమైన ప్రభావముగల ఓ దేవా! ముల్లోకముల యందును నీకు సము డెవ్వడును లేడు. ఇంక అధికుడు లేడని చెప్పవలయునా!

* తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్
పితేవ పుత్త్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియా యార్హసి దేవ! సోఢుమ్. 44

కనుక, నీకు సాష్టాంగ నమస్కారము చేసి, స్తోత్రార్హుడవైన నిన్ను ప్రసన్నుడవు కమ్మని ప్రార్థించుచున్నాను. తండ్రి కుమారుని యొక్కయు, స్నేహితుడు స్నేహితునియొక్కయు, పతి భార్య యొక్కయు అపరాధమును క్షమించునట్లు, నీవు నా తప్పు లన్నియు క్షమింపుము.

* అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే
తదేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస! 45

కృష్ణా! ఆశ్చర్యకరమైన నీ ఈ రూప మిదివరకు ఎన్నడును కనివిని ఎరుగనిది. దీనిని చూచుటచే చాల ఆనందమైనది. కాని నా మనస్సు భయముచే వ్యాకులత కూడ చెంది ఉన్నది. కనుక ఎప్పుడును నేను చూచు నీ పూర్వరూపమునే నాకు చూపుము. దేవేశా! జగన్నివాసా! నా ఎడల ప్రసన్నుడవుకమ్ము.

* కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే! 46

కిరీటమును ధరించి, గదను, చక్రమును హస్తములందు ధరించిన నిన్ను చూడగోరుచున్నాను. విశ్వరూపా ! సహస్రబాహూ! నీ ఆ చతుర్భుజ రూపముతోనే దర్శనమిమ్ము !

శ్రీ భగవానువాచ :

* మయా ప్రసన్నేన తవార్జు నేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్
తేజోమయం విశ్వ మనంత మాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్. 47

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

అర్జునా ! అపరిమిత తేజోమయమును, విశ్వవ్యాప్తమును, ఆది మధ్యాంత రహితమును, సనాతనమును అగు నా ఈ రూపమును నీయందలి అనుగ్రహము చేతనే చూపితిని. నీవు కాక ఇతరు లెవ్వరును, ఇంతవరకీ రూపమును దర్శించి యుండలేదు.

* న వేద యజ్ఞాధ్యయనైర్న దానై
ర్న చ క్రియాభి ర్న తపోభి రుగ్రైః
ఏవం రూప శ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ! 48

వేదములచేగాని, యజ్ఞములచేగాని, అధ్యయనములచేగాని, దానములచేగాని, క్రియలచేగాని, ఉగ్రమైన తపస్సుచేగాని - ఏసాధనములచేతను ఈలోకమున ఎవ్వరును ఈ నా రూపమును చూడలేరు. ఓ కురువంశశ్రేష్ఠా ! కేవలము నా అనుగ్రహముచే నీవు మాత్రమే చూడగలిగితివి.

* మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృ జ్మమేదమ్
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య. 49

భయంకరమైన నా ఈ రూపమును చూచి నీవు భయమును, భ్రాంతిని చెందకుము. భయమును విడిచి, సంతోషముతో, నీవు కోరిన నా సౌమ్యరూపమును నీవు చూడుము.

సంజయ ఉవాచ :

* ఇ త్యర్జునం వాసుదేవ స్త థోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః
ఆశ్వాసయామాస చ భీత మేవం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా. 50

సంజయుడు చెప్పుచున్నాడు :

పరమాత్మ పార్థునితో ఇట్లు పలికి, తన సౌమ్యరూపమును మరల చూపెను. శాంతస్వభావమైన సౌమ్యరూపమును ధరించి భయము నొందియున్న అర్జునుని ఓదార్చెను.

అర్జున ఉవాచ :

* దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన!
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః. 51

అర్జునుడు చెప్పుచున్నాడు :

జనార్దనా! అతిశాంతమైనదియును, నరలీల కొరకు ధరించినదియును అగు నీ ఈ మానుషరూపమును చూచి నా చిత్తము కుదుటపడినది. మరల పూర్వస్థితికి వచ్చితిని.

శ్రీ భగవానువాచ :

* సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి య న్మమ
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః. 52

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :
నీవు చూచుచుండెడి నా ఈ రూపము, అందరును చూడలేరు. బ్రహ్మాదిదేవతలు సైతము ఈ రూపమును చూచుటకు నిత్యము కోరుచుందురు.

* నాహం వేదై ర్నతపసా నదానేన నచేజ్యయా
శక్య ఏవంవిధో ద్రంష్టుం దృష్టవా నసి మాం యథా. 53

నీవు చూచిన విధమున నన్ను చూచుట వేదాధ్యయనములచే గాని, తపస్సులచేగాని, దానములచేగాని, యజ్ఞములచేగాని సాధ్యము కాదు.

* భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప. 54

కేవలము అనన్యభక్తిచేతనే ఈ విధమైన నా యథార్థ స్వరూపమును తెలిసికొనుటకును, ప్రత్యక్షముగ దర్శించుకొనుటకును, ప్రవేశించుటకును - అనగా పరిపూర్ణముగ అనుభవించుటకును - శక్యము అగును.

* మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాండవ! 55

ఓ అర్జునా! నా కొరకే కర్మలుచేయువాడు, నేనే పరమగతి అని ఉన్నవాడు, నాభక్తుడు, ఆసక్తిరహితుడు ఏభూతము నందును కూడ వైరము లేనివాడు - అట్టివాడు మాత్రమే నన్ను పొందుచున్నాడు.

ఓం తత్ సత్

ఇతి శ్రీమ ద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విశ్వరూపసందర్శన
యోగోనామ ఏకాదశోఽధ్యాయః

ఓం శ్రియఃపతయే నమః
ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీ గీతామృతము

## ద్వాదశాధ్యాయము - భక్తియోగము

అర్జున ఉవాచ :

* ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ? 1

అర్జునుడు అడుగుచున్నాడు :

కృష్ణా ! ఇప్పుడు నీవు చెప్పినరీతిగ నిరంతరము నీ భజన ధ్యానాదులయందే నిమగ్నులై ఉండి, నిన్నే పరిపూర్తిగ ఉపాసించువారును; కేవలము అవ్యక్తము, అక్షరము అగు స్వరూపమును ఉపాసించువారును - ఈ రెండురకములైన వారిలో యోగము బాగుగ తెలిసినవారు ఎవరు ?

శ్రీ భగవానువాచ :

* మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః. 2

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

మనస్సును నాయందే ఏకాగ్రముచేసి, అపరిమిత శ్రద్ధావంతులై, ఎడతెగని భజన ధ్యానాదులతో సకల కల్యాణగుణ పరిపూర్ణుడనైన నన్ను ఉపాసించువారే యోగము తెలిసినవారిలో అత్యుత్తములని నా అభిప్రాయము.

* యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగమచిన్త్యం చ కూటస్థమచలం ధ్రువమ్. 3

* సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః. 4

కాని, సర్వేంద్రియములను నిగ్రహించి, సర్వభూతములందును సమబుద్ధిగలిగి, సర్వమునకును హితముకోరువారై, నశింపనిదియు, ఇట్టిదని చెప్పుటకు సాధ్యము కానిదియు, ఇంద్రియములకు గోచరము కానిదియు, సర్వత్ర వ్యాపించి ఉన్నదియు, ఊహించుటకు వీలులేనిదియు, వికారములు లేనిదియు, చలించనిదియు, ధృవమైనదియు అగు రూపమును ఉపాసించుచున్నారో, వారుకూడ నన్నే పొందుచున్నారు.

* క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహావద్భి రవాప్యతే. 5

అర్జునా! ఇట్టి అవ్యక్తోపాసకులకు కష్టములు చాల మిక్కుటములు సుమా! ఏలయన, దేహధారులకు అవ్యక్తోపాసనా మార్గము క్లేశముచేతనే పొందబడును.

* యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యే నైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. 6

* తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామి న చిరాత్పార్థ! మయ్యావేశితచేతసామ్. 7

సర్వకర్మలను నాయందే సమర్పించి, నన్నే పరమగతిగ తలచి, అనన్యభక్తియోగముచే నన్నే ధ్యానించుచు ఉపాసించువారిని- నాయందే లగ్నమైన మనస్సుగల అట్టి నాభక్తులను - అర్జునా! మృత్యురూపమైన సంసారసముద్రమునుండి అతి శీఘ్రముగ నేనే ఉద్ధరించుచున్నాను.

* మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. 8

కాబట్టి అర్జునా! నాయందే మనస్సును ఉంచుము. బుద్ధిని కూడ నాయందే ప్రవేశపెట్టుము. ఇట్లు మనోబుద్ధులు రెండును నా పరము చేసిన నీవు నాయందే నివసించగలవు- అనగా నన్నే పరిపూర్ణముగ అనుభవించగలవు. ఎంతమాత్రము సంశయము లేదు.

* అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ! 9

నీవు నాయందు స్థిరముగ మనస్సును స్థాపించి, ఎడతెగని భజన ధ్యాన గుణానుభవాదుల యందే గడపలేని యెడల, నిత్యమును మనస్సును విషయములనుండి మరలించి, నాయందే నిలుపుటకు తగిన ఏదో ఒక విధమును అవలంబించి అభ్యాసము చేయుము.

* అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ
మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి. 10

ఇట్లు అభ్యాసము కూడ చేయలేవేని, నాకు సంబంధించిన కర్మలు- అనగా మాలలుకట్టుట, మందిరము ఊడ్చుట, దీపారాధన చేయుట, ప్రదక్షిణ నమస్కారములు చేయుట, మొదలగు కర్మలు - చేయుచుండుము. ఈ విధముగ నా సేవకు సంబంధించిన కర్మలు చేసికూడ సిద్ధిని పొందగలవు.

* అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. 11

అట్లు నాకు సంబంధించిన కర్మలు చేయుటకు కూడ శక్తుడవు కానేని, మనస్సును వశమందుంచుకొన్నవాడవై, నీ వర్ణాశ్రమోచితములైన కర్మల నన్నిటిని చేయుచు, వాటి ఫలమును మాత్రము వదలిపెట్టుము - అనగా, ఆ యా కర్మలు చేయు

నప్పుడు వాటి ఫలమును నీవు కోరక, "కృష్ణార్పణము" అని నాకే విడిచిపెట్టుము.

* శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే
ధ్యానాత్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాంతి రనంతరమ్. 12

అభ్యాసముకంటె జ్ఞానము శ్రేయస్కరము. జ్ఞానముకంటె ధ్యానము శ్రేష్ఠము ధ్యానమువలన కర్మఫలత్యాగము కలుగును. త్యాగమువలన చివరకు శాంతి చేకూరును.

* అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ. 13

* సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మ య్యర్పిత మనోబుద్ధి ర్యో మ ద్భక్త స్స మే ప్రియః. 14

ఏభూతమునందును ద్వేషములేక, సర్వమునందును మిత్రభావమును, కరుణయును కలిగి, అహంకార మమకారములు లేక, సుఖదుఃఖములయందు సమభావము కలిగి, ఓర్పు, ఎల్లప్పుడును తృప్తియు కలిగి, నియమించబడిన మనస్సు, దృఢమైన నిశ్చయమును కలిగి, మనస్సును, బుద్ధిని నాకు సమర్పించిన నా భక్తుడు నాకు ప్రియమైనవాడు.

* యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతే చ యః
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో య స్స చ మే ప్రియః. 15

లోకమును భయపెట్టనివాడును, లోకమువలన భయము చెందనివాడును, ప్రాపంచిక విషయములను గూర్చిన సంతోషము, అసూయ, భయము, మనోవ్యాకులత లేనివాడును అగు నాభక్తుడు నాకు ప్రియమైనవాడు.

* అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః. 16

అపేక్ష లేనివాడును, లోపలను వెలుపలను కూడ శుచియైన వాడును, సమర్థుడును, ఉదాసీనుడును, దుఃఖరహితుడును, అన్నివిధములైన కర్తృత్వాభిమానములను వదలినవాడును, అయిన నాభక్తుడు నాకు ప్రియమైనవాడు.

* యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి
శుభాశుభ పరిత్యాగీ భక్తిమా న్య స్స మే ప్రియః. 17

తనకు ఇష్టమైనవి లభించినప్పుడు సంతోషించుట, లభించనప్పుడు ద్వేషించుట లేనివాడును, దుఃఖింపనివాడును, కోరనివాడును, శుభాశుభములు రెంటిని వదలిపెట్టినవాడును అగు నాభక్తుడు నాకు ప్రియమైనవాడు.

* సమ శ్శత్రౌ చ మిత్రేచ తథా మానావమానయోః
శీతోష్ణ సుఖదుఃఖేషు సమ స్సంగ వివర్జితః. 18

* తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్
అనికేత స్థిరమతి ర్భక్తిమా న్మే ప్రియో నరః. 19

శత్రుమిత్రుల యందును, మానావమానములయందును, శీతోష్ణ సుఖదుఃఖములయందును, సమబుద్ధి కలవాడును, ప్రాపంచిక విషయములయందు ఆసక్తి లేనివాడును, నిందాస్తుతులయందు సముడైనవాడును, మౌనియును, శరీర నిర్వాహణమందు ప్రారబ్ధ కర్మానుసారము లభించినదానితో సంతుష్టుడై ఉండువాడును, గృహాదులయందు మమకారము లేనివాడును, చలించనిబుద్ధి కల వాడును అగు నాభక్తుడు నాకు ప్రియమైనవాడు.

* యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్ధధానా మత్పరమా భక్తా స్తే౽తీవ మే ప్రియాః. 20

శ్రద్ధావంతుడై, నన్నే పరమగతిగ తలచి, ఇప్పుడు చెప్పిన ధర్మమయమైన ఈ అమృతమును సేవించువాడు - అట్టి నాభక్తుడే - నాకు అత్యంతము ప్రియమైనవాడు.

ఓం తత్ సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే భక్తియోగోనామ
ద్వాదశో౽ధ్యాయః

ఓం శ్రీయఃపతయేనమః
ఓం శ్రీపరమాత్మనేనమః

# శ్రీ గీ తా మృ త ము

## త్రయోదశాధ్యాయము - క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగము

శ్రీ భ గ వా ను వా చ :

* ఇదం శరీరం కౌంతేయ ! క్షేత్ర మి త్యభిధీయ తే
ఏత ద్యో వే త్తి తం ప్ర హుః క్షే త్రజ్ఞ ఇతి తద్విదః. 1

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

అర్జునా ! ఈ శరీరమే క్షేత్రము అనబడుచున్నది. ఈ శరీరమును తెలిసికొనినవాడు క్షేత్రజ్ఞుడు అని తత్త్వవేత్తలు చెప్పుచున్నారు.

* క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత !
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం య త్తత్ జ్ఞానం మతం మమ. 2

సర్వక్షేత్రములందును క్షేత్రజ్ఞుడనుకూడ నేనే అని తెలుసుకొనుము. క్షేత్రక్షేత్రజ్ఞులకు సంబంధించిన ఈ జ్ఞానమే - అనగా ఏదిక్షేత్రమో,ఎవడు క్షేత్రజ్ఞుడో, క్షేత్రమునకును క్షేత్రజ్ఞునకును ఏమిసంబంధమో, ఈ క్షేత్రజ్ఞుడు జననమరణరూప సంసారము నుండి తరించు టెట్లో, ఇది యంతయును తెలిసికొనుటే- నిజమైన జ్ఞానమని నా అభిప్రాయము.

* తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యు ద్వికారి యతశ్చయత్
స చ యో యత్ప్రభావశ్చ త త్సమాసేన మే శృణు. 3

క్షేత్రమేదియో, ఎట్టిదో, ఏ యే వికారములు కలిగినదో, ఎందు వలన కలిగినదో, ఆ క్షేత్రజ్ఞు డెవడో, వాని ప్రభావ మెట్టిదో, సంక్షేపముగ చెప్పుచున్నాను వినుము.

* ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్ర పదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః. 4

క్షేత్రక్షేత్రజ్ఞులను గూర్చిన ఈ తత్త్వము, ఋషులచేత చాల విస్తారముగ చెప్పబడినది. అనేక వేదమంత్రములలోను, బ్రహ్మసూత్రములలోను కూడ, యుక్తియుక్తముగ నిశ్చయరూపముగ వర్ణింపబడియున్నది.

* మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవ చ
ఇంద్రియాణి దశైకం చ పంచచేంద్రియ గోచరాః. 5

* ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్. 6

భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము అను పంచ మహాభూతములును, అహంకారమును, బుద్ధియును, మూలప్రకృతియును, చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు అను జ్ఞానేంద్రియములైదును, వాక్కు, చేయి, కాలు, ఉపస్థము - అనగా మూత్రవిసర్జనేంద్రియము, గుదము - అనగా మలవిసర్జనేంద్రియము - అను కర్మేంద్రియములైదును, మొత్తమింద్రియములు పదియును, మన స్సొకటియును, జ్ఞానేంద్రియములకు విషయములైన శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అను అయిదును, కోరికయును, ద్వేషమును, సుఖమును, దుఃఖమును, పంచభూతములచే చేయబడిన ఈ స్థూలపిండమును - అనగా స్థూలదేహమును, ప్రాణమును, ధృతియును- ఈ మొత్తము క్షేత్ర మనబడును. వికారసహితమైన క్షేత్రమును గూర్చి సంక్షేపముగ చెప్పితిని.

* అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః 7

* ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్. 8

* అసక్తి రనభిష్వంగః పుత్ర దార గృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు. 9

* మయి చానన్య యోగేన భక్తి రవ్యభిచారిణీ
వివిక్తదేశ సేవిత్వ మరతి ర్జనసంసది. 10

* అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్
ఏతత్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం య దతో ఽన్యథా. 11

గౌరవమును కోరకుండుట, దంభము లేకుండుట, అహింస, ఓర్పు, మనోవాక్కాయముల శుద్ధియు, మృదుత్వమును, శ్రద్ధా భక్తులతో గురుసేవ చేయుట, లోపలను వెలుపలను కూడ శుచిగ ఉండుట, అంతఃకరణముయొక్క స్థిరత్వము, మనస్సును వశమందుంచుకొనుట, ఇంద్రియ విషయములయందు వైరాగ్యము, అహంకారము లేకుండుట, జననము, మరణము, ముసలితనము, వ్యాధి మొదలగువాని యందలి దుఃఖములను దోషములను మాటిమాటికిని విచారించి చూచుకొనుచుండుట, పుత్రులు, భార్య, గృహము మొదలగువాటియందు ఆసక్తియును మమకారమును లేకుండుట, ఇష్టానిష్ట ప్రాప్తియందు చిత్తమును చలించనీయక సమముగ ఉంచుకొనుట, నాయందు అనన్య భావముతో చలించని భక్తి కలిగి ఉండుట, పవిత్రమును, ఏకాంతమును అగు ప్రదేశమందే ఉండుట, సాంసారిక జన సముదాయముతో కలిసిఉండకపోవుట, ఎల్లప్పుడును అధ్యాత్మ

జ్ఞానమందే నిలిచియుండుట, తత్త్వజ్ఞానమునకు ఫలమైన పరమాత్మను ఎప్పుడును చింతించుచుండుట - ఈ మొదలగునది అంతయు జ్ఞానమని చెప్పబడినది. దీనికి విపరీతమైన దంతయు అజ్ఞానమే.

* జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వామృతమశ్నుతే
అనాదిమత్పరంబ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే. 12

* సర్వతః పాణి పాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి. 13

అర్జునా! ఏది తెలిసికొనదగినదో, దేని తెలిసికొనుటచేత పురుషుడు జనన మరణ రహితమైన పరమపదవిని-మోక్షమును-పొందుచున్నాడో, దానిని బాగుగ చెప్పెదను వినుము. అది అనాది అయినది. పరబ్రహ్మము. సదసత్తులు రెండును కానిది. ప్రతిచోటను చేతులు, కాళ్ళును కలది. దానికి ప్రతిచోటను కండ్లు, శిరస్సులు, ముఖములు కలవు. అంతటను చెవులు కలది. ఏలయన, అది లోకమంతయు వ్యాపించియున్నది.

* సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ. 14

* బహిరంతశ్చ భూతానా మచరం చరమేవ చ
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికేచ తత్. 15

సర్వేంద్రియ విషయములను తెలిసికొనదగినదియు,సర్వేంద్రియ రహితమైనదియు, దేనికిని అంటనిదియు, సర్వమును భరించునదియు, సత్త్వ రజస్తమో గుణముల కతీతమైనదియు, గుణముల కధిపతియు, సకల భూతములకును లోపలను వెలుపలను కూడ నిండియున్నదియు, కదలనిదియు, కదులునదియు కూడ అయి

ఉన్నది. అది సూక్ష్మ మగుటవలన తెలియబడనిది. అది అతి సమీపమందును, మిక్కిలి దూరమందును కూడ ఉన్నది.

* అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్
భూత భర్తృచ తత్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ. 16

అది విభజింపబడుటకు వీలులేనిది. కాని, సర్వభూతములందును విభజింపబడిన దానివలె ఉన్నది. అది భూతములను భరించునదియును, సంహారించునదియును, పుట్టించునదియును అని తెలిసికొనుము.

* జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్. 17

అది సూర్యుడు మొదలైన ప్రకాశమానములైనవాటిని కూడ ప్రకాశింపచేయునది. మాయకంటె పరమైనది. అదియే జ్ఞానము, జ్ఞేయము. జ్ఞానముచే పొందదగినది కూడ అదియే. సకల ప్రాణుల యొక్క హృదయములయందు విశేషించి యుండునది అదియే.

* ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే. 18

ఈ విధముగ క్షేత్రమును గూర్చియును, జ్ఞానమును గూర్చియును, జ్ఞేయమును గూర్చియును సంక్షేపముగ చెప్పితిని. నా భక్తుడు దీనిని తెలిసికొని నన్ను పొందుచున్నాడు.

* ప్రకృతిం పురుషం చైవ వి ద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాం శ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్. 19

ప్రకృతి పురుషులు ఉభయులును కూడ ఆది లేనివారే సుమా ! వికారములును, గుణములును, ప్రకృతివలన పుట్టినవని తెలిసికొనుము.

* కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే. 20

శరీరముయొక్కయు, ఇంద్రియములయొక్కయు కర్తృత్వము నందు ప్రకృతియే కారణమని చెప్పబడినది. సుఖదుఃఖములను అనుభవించుటయందు పురుషుడు కారణమని చెప్పబడుచున్నాడు.

* పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజా న్గుణాన్
కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు. 21

ప్రకృతిసంసర్గము కలవాడై పురుషుడు, ప్రకృతిసంభవములైన గుణములను అనుభవించుచున్నాడు. గుణముల సాంగత్యమే ఈ పురుషునియొక్క మంచి జన్మలకును, నీచజన్మలకును కూడ కారణమై యున్నది.

* ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మి న్పురుషః పరః. 22

ఈ పురుషుడు ఈ దేహమందున్నను, దీనికి పరుడుగనే ఉన్నాడు. దేహమును చూచువాడును, ఆమోదించువాడును, ఈ దేహేంద్రియములను భరించువాడును, దేహేంద్రియములచేత చేయబడిన కర్మలయొక్క ఫలమును అనుభవించువాడును, దేహేంద్రియ మనోబుద్ధుల కీశ్వరుడును, ప్రకృతిరూపమైన దేహేంద్రియములకు పరమైన ఆత్మస్వరూపమును కనుక,

దేహేంద్రియముల విషయమున పరమాత్మ అనియు చెప్పబడు చున్నాడు.

* య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే. 23

ఈ విధముగ ప్రకృతిని, క్షేత్రజ్ఞు డనబడు పురుషుని, గుణములతో సహా తెలిసికొనినవాడు అన్నివిధముల చేతను తన కర్తవ్యకర్మలు చేయుచున్నను మరల జన్మలకు రాడు.

* ధ్యానే నాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. 24

కొంతమంది పరిశుద్ధమైన బుద్ధిచే ధ్యానయోగముద్వారా, తమ యందున్న పరమాత్మను చూచుచున్నారు. కొంతమంది సాంఖ్య యోగముచేతను - అనగా జ్ఞానయోగముచేతను, కొంతమంది కర్మయోగముచేతను చూచుచున్నారు.

* అన్యే త్వేవ మజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతి పరాయణాః. 25

తెలియని మరికొందరు తెలిసిన మహాత్ములవలన విని, వినినరీతిగ ఉపాసించుచున్నారు. శ్రవణమునందు నిష్ఠ కలిగిన వీరుకూడ మృత్యురూపమైన సంసారమునుండి తరించుచున్నారు.

* యావత్సంజాయతే కించి త్సత్త్వం స్థావర జంగమమ్
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ ! 26

అర్జునా ! పుట్టుక కలిగిన స్థావర జంగమరూపమైన ఈ సకల జగత్తునుకూడ, ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగము వలననే కలిగి నదిగ తెలిసికొనుము.

* సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్
వినశ్య త్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి. 27

నశించునట్టి ఈ సర్వభూతములందును సమముగ వ్యాపించి యున్నట్టియు, నాశము లేనట్టియు పరమేశ్వరుని చూచుచున్న వాడే యథార్థమును చూచుచున్నాడు.

* సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్
న హిన స్త్యాత్మ నాత్మానం తతో యాతి పరాంగతిమ్. 28

అంతటను నిండి నిబిడీకృతమైయున్న పరమాత్మను సమముగ చూచువాడు, తనను తాను అథోగతులపాలు చేసికొనక, పరమ గతికే పోవుచున్నాడు.

* ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః
యః పశ్యతి త థాత్మాన మకర్తారం స పశ్యతి. 29

సమస్త కర్మలును ప్రకృతి ద్వారముననే చేయబడుచున్న వనియును, ఆత్మ ఏమియు చేయుటలేదనియును తెలిసికొన్నవాడే యథార్థము తెలిసినవాడు.

* యదా భూత పృథగ్భావ మేకస్థ మనుపశ్యతి
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా. 30

బహువిధములై భాసించు ఈ జగత్తంతకును మూలమైన ప్రకృతి ఒకటియే అనియును, దానిలో భేదమేమియును లేదనియును, ఆ ఒక్క ప్రకృతియే ఇన్ని విధములుగ కనపడుచున్నదనియును - తెలిసికొని, మృత్తికావికారములైన సకల పాత్రలయందును ఒక్క మృత్తికనే చూచినట్లు, ప్రకృతివికారములైన సర్వభూతము లందును ఒక్క ప్రకృతినే చూడగలిగినవాడు, అప్పుడే పరమాత్మను పొందుచున్నాడు.

* అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమా త్మాయ మవ్యయః
శరీరస్థోఽపి కౌంతేయ ! న కరోతి న లిప్యతే. 31

అర్జునా ! సనాతనుడును, నిర్గుణుడును అగుటచే అవినాశియైన ఈ పరమాత్మ సర్వశరీరములయం దున్నను, ఏమియు చేయుట లేదు. ఆయన కేమియు అంటదు.

* యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే
సర్వ త్రావస్థితో దేహే త థాత్మా నోపలిప్యతే. 32

ఆకాశము సర్వత్ర వ్యాపించియున్నను, అది సూక్ష్మమగుటవలన, తాను వ్యాపించియున్న ఆయా వస్తువుల స్వభావముచేత అంట బడదు. అదేవిధమున, దేహములందు సర్వత్ర వ్యాపించియున్నను పరమాత్మ, వాటి స్వభావములచేత - అనగా పాప పుణ్యముల చేత - అంటబడదు.

* యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ! 33

ఒక్కడే సూర్యు డీ లోకమునంతను ప్రకాశింపజేయుచున్నట్లే, క్షేత్రజ్ఞుడైన జీవాత్మ, క్షేత్రమైన శరీరమునంతను ప్రకాశింప జేయుచున్నాడు - అనగా అతని సత్తవలననే, ఈ శరీర మనో బుద్ధీంద్రియములన్నియు తమ తమ పనులందు ప్రవృత్తికలవి అగుచున్నవి.

* క్షేత్ర క్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞానచక్షుషా
భూతప్రకృతి మోక్షం చ యే విదు ర్యాంతి తే పరమ్. 34

జ్ఞాననేత్రముచేత క్షేత్రము-నకును క్షేత్రజ్ఞునకును కల భేదమును, భూతములకు కారణమైన ప్రకృతినుండి విడుదలయగు ఉపాయమును తెలిసికొనినవారు పరమును- అనగా మోక్షమును-పొందుచున్నారు.

ఓం తత్ సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ
యోగోనామ త్రయోదశోఽధ్యాయః

ఓం శ్రియఃపతయేనమః

ఓం శ్రీపరమాత్మనేనమః

# శ్రీ గీతామృతము

## చతుర్దశాధ్యాయము - గుణత్రయవిభాగ యోగము

శ్రీ భగవానువాచ :

* పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్
యత్ జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః 1

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

అర్జునా ! జ్ఞానములన్నిటిలోను ఉత్తమమైన శ్రేష్ఠమైన జ్ఞానమును మరల చెప్పుచున్నాను వినుము. దీనిని తెలిసికొని సమస్త మునులును ఉత్కృష్టమైన సిద్ధిని పొందియున్నారు.

* ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః
సర్గేఽపి నోపజాయంతే ప్రలయే న వ్యథంతి చ. 2

ఈ జ్ఞానమును ఆశ్రయించినవారు అన్నివిధముల చేతను నన్ను పొందుచున్నారు. ఇక వారు ఈ సృష్టిలోనికి తిరిగిరారు - అనగా బ్రహ్మాండములయొక్క సృష్టి ప్రళయములతో వారి కేమియును సంబంధము లేదు.

* మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మి న్గర్భం దధా మ్యహమ్
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత ! 3

నా మూలప్రకృతియే సకల భూతములకును కారణము. ఆ మూలప్రకృతియందు నేను గర్భమును ఉంచుచున్నాను. దానివలన సర్వభూతములయొక్క ఉత్పత్తియును కలుగుచున్నది.

* సర్వయోనిషు కౌంతేయ ! మూర్తయ స్సంభవంతి యాః
తాసాం బ్రహ్మ మహ ద్యోని రహం బీజప్రదః పితా. 4

సకలవిధ జన్మములందును పుట్టుచున్న పలురకములైన ప్రాణుల కెల్లను మూలకారణము, అనగా గర్భమును ధరించునట్టి, అవ్యక్తమైన మహద్బ్రహ్మమను మూలప్రకృతియే తల్లి. బీజప్రదుడనైన- అనగా గర్భమును కలుగజేయునట్టి - తండ్రిని నేను.

* సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః
నిబధ్నంతి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్. 5

అర్జునా ! ప్రకృతి సంభవములైన సత్త్వరజ స్తమోగుణములు మూడును, అవ్యయుడైన దేహిని - అనగా క్షేత్రజ్ఞుడనబడు ఆత్మను - దేహమునందు బంధించుచున్నవి.

* తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ ! 6

ఆ మూడు గుణములలో సత్వగుణము నిర్మలమైనదగుటచే, జ్ఞాన ప్రకాశమును కలుగజేయునదియును, వికారరహితమైనదియును అయి ఉన్నది. అది సుఖసంబంధము చేతను, జ్ఞానసంబంధము చేతను అభిమానమును కలిగించి, ఆత్మను బంధించుచున్నది.

* రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగ సముద్భవమ్
త న్నిబధ్నాతి కౌంతేయ ! కర్మసంగేన దేహినమ్. 7

అర్జునా, రాగాత్మికమైన రజోగుణము, విషయములందాశను, సంగమును కలిగించి, కర్మాభిలాష చేత బంధించుచున్నది.

* తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్
ప్రమా దాలస్య నిద్రాభి స్త న్నిబధ్నాతి భారత ! 8

సమస్త జీవులను మోహమున ముంచునట్టి తమోగుణము, అజ్ఞానము వలన పుట్టినదని తెలిసికొనుము. ఈ గుణము జీవాత్మను, ప్రమాదము, ఆలస్యము, నిద్ర మొదలగువాటిచే బంధించుచున్నది.

* సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత !
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయ త్యుత. 9

సత్త్వగుణము సుఖమునందును, రజోగుణము కర్మలయందును, తమోగుణము జ్ఞానమును మరుగుపరచి దుర్మార్గాచరణమను ప్రమాదమునందును ప్రవృత్తిని కలుగ జేయుచున్నవి.

* రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత !
రజ స్సత్త్వం తమ శ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా. 10

సత్త్వగుణము వృద్ధిపొందినప్పుడు, రజోగుణ తమోగుణములు రెండును అణచబడుచున్నవి. రజోగుణము వృద్ధిపొందినప్పుడు, సత్త్వ తమోగుణములు శక్తిహీనము లగుచున్నవి. అట్లే తమోగుణము వృద్ధిపొందినప్పుడు, సత్త్వ రజోగుణములు బలహీనము లగుచున్నవి.

* సర్వద్వారేషు దేహేఽస్మి న్ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వ మిత్యుత. 11

ఎప్పుడు దేహమునందలి సర్వేంద్రియములయందును లాఘవమును, ఉత్సాహమును, నిర్మలత్వమును, చైతన్యశక్తియు, సారాసార విచార జ్ఞానమును కలుగునో అప్పుడు సత్త్వగుణము వృద్ధిలో ఉన్నదని తెలియవలయును.

* లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమ స్స్పృహా
రజ స్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ ! 12

లోభమును, కామ్యకర్మలు చేయుటయందు పూనికయు, మనశ్చంచలత్వమును, చికాకు, విషయాభిలాషయు కలిగినప్పుడు రజోగుణము వృద్ధిలో ఉన్నదని తెలియుము.

* అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ
తమ స్యేతాని జాయంతే వివృద్ధే కురునందన ! 13

అర్జునా ! దేహమునందు బరువు, మనో బుద్ధీంద్రియములందు ఉత్సాహము లేకపోవుట, ఏ పని చేయుటకును సోమరితనము, దుర్మార్గమునందు ప్రవర్తించుట, విపరీత జ్ఞానము, ఎప్పుడును నిద్రపోవుట మొదలగు ఈగుణములు కలిగినప్పుడు తమోగుణము వృద్ధిలో ఉన్నట్లు తెలిసికొన వలయును.

* యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాతి దేహభృత్
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే. 14

సత్త్వగుణము వృద్ధిగ ఉన్న సమయములో ఆత్మ ఈ దేహమును విడిచిన, శాస్త్రవిహితమైన యజ్ఞయాగాది ఉత్తమ కర్మలు ఆచరించినవారు పోవు స్వర్గాది లోకములకు పోవుచున్నారు.

* రజసి ప్రలయం గత్వా కర్మ సంగిషు జాయతే
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. 15

రజోగుణము వృద్ధిలోఉండగ దేహమును విడిచిన, ఆసక్తితో కర్మలాచరించువారి వంశములందు పుట్టుచున్నారు. తమోగుణము వృద్ధిలోఉండగ మరణించిన పక్షులు, మృగములు, పశువులు మొదలగు నీచజన్మము లెత్తుచున్నారు.

* కర్మణ స్సుకృత స్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. 16

సాత్త్వికకర్మకు కలుగు ఫలము సత్త్వగుణ సంబంధమైనదిగను, సర్వదోష రహితమైనదిగను ఉండును. రాజసకర్మకు దుఃఖ రూపమైన ఫలము కలుగును. తామసకర్మకు కేవలము అజ్ఞానమే ఫలము.

* సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ. 17

సత్త్వగుణమువలన జ్ఞానము కలుగుచున్నది. రజోగుణమువలన తప్పక లోభగుణము కలుగుచున్నది. ప్రమాదము, మోహము, అజ్ఞానము తమోగుణమువలన కలుగుచున్నవి.

* ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛంతి తామసాః. 18

సత్త్వగుణమును వృద్ధి చేసికొని దానియందే నిలిచినవారు, ఊర్ధ్వ లోకములకు పోవుచున్నారు. రజోగుణ సంపన్నులు, మనుష్యాది మధ్యమ లోకములో చేరుచున్నారు. నీచగుణ వ్యాపారముల యందున్న తమోగుణ సంపన్నులు అధోలోకములకు పోవుచున్నారు.

* నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. 19

ద్రష్ట ఎప్పుడు గుణములకంటె ఇతరమైన కర్తను చూడడో, గుణములకంటె పరుడైన నన్ను తెలిసికొనుచున్నాడో, అప్పుడు వాడు నా స్వరూపమును పొందుచున్నాడు.

* గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే. 20

పురుషుడు, దేహము కలుగుటకు కారణమైన ఈ మూడుగుణములను అతిక్రమించి, జననము, మరణము, ముదిమి-వీటివలన కలుగు దుఃఖములనుండి విముక్తుడై, మోక్షమును పొందుచున్నాడు.

అర్జున ఉవాచ:

* కైర్లింగై స్త్రీన్గుణా నేతా నతీతో భవతి ప్రభో!
కి మాచారః కథం చైతాం స్త్రీన్గుణా నతివర్తతే. 21

అర్జునుడు అడుగుచున్నాడు:

ఈ మూడుగుణములకు అతీతుడైన పురుషుడు ఎట్టి లక్షణములతో కూడి ఉండును? అతని ఆచార మెట్లుండును? ఈ మూడు గుణములకు అతీతు డగుటకు తగిన ఉపాయమేది?

శ్రీ భగవానువాచ:

* ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ!
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి. 22

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు:

సత్త్వాది గుణకార్యములైన ప్రకాశము, ప్రవృత్తి, మోహము-వీటి ప్రవృత్తియందు ద్వేషమును, నివృత్తియందు కాంక్షయు లేక ఉండువాడు గుణాతీతుడు.

* ఉదాసీనవ దాసీనో గుణైర్యో న విచాల్యతే
గుణావర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే. 23

దేనికిని తగులువడక, ఉదాసీనునివలె ఉండి, గుణములచేత చలించక, గుణములు తమ తమ కార్యములు చేసికొనుచున్నవని తలచి, పరమాత్మానుసంధానము చేసికొనుచు ఉండువాడు గుణాతీతుడు.

* సమ దుఃఖ సుఖ స్స్వస్థ స్సమ లోష్టాశ్మ కాంచనః
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్య నిందాత్మసంస్తుతిః. 24

సుఖదుఃఖములయందు సముడై, స్వస్వరూపానుసంధానము నందే ఉండి, మట్టిని, రాతిని, బంగారమును సమముగ చూచుచు, ఇష్టానిష్ట వస్తువులయందు సముడై, ధీరుడై, తన్ను ఇతరులు నిందించినను, స్తుతించినను సమభావము కలిగి ఉండు వాడు గుణాతీతుడు.

* మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారంభ పరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే. 25

మానావమానములయందును, శత్రు మిత్రులయందును సమబుద్ధి కలిగి, ఏ కర్మలయందును కర్తృత్వాభిమానములు లేక ఉండు వాడు గుణాతీతుడని చెప్పబడుచున్నాడు.

* మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణా న్సమతీ త్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. 26

చలించని భక్తియోగముచే నన్ను సేవించుచుండువాడీ మూడు గుణములను సమగ్రముగ దాటి, గుణాతీతుడై, సచ్చిదానంద ఘనస్వరూపుడనైన నన్ను పొందుచున్నాడు.

* బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మమృత స్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాంతికస్య చ. 27

అమృత స్వరూపమును, అవ్యయమును అయిన నిరాకార పర బ్రహ్మమునకును, శాశ్వత ధర్మమునకును, మోక్షమునకును కూడ నేనే ఆధారుడనుగదా !

ఓం తత్ సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే గుణత్రయవిభాగ
యోగోనామచతుర్దశోఽధ్యాయః

ఓం శ్రియఃపతయే నమః
ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీ గీతామృతము

## పంచదశాధ్యాయము – పురుషోత్తమప్రాప్తి యోగము

శ్రీ భగవానువాచ:

* ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్. 1

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు:

మొదలు పైకిని, శాఖలు క్రిందికిని కల అశ్వత్థ వృక్షమును అవ్యయమైనదిగ చెప్పుచున్నారు. దానికి వేదములే పర్ణములు. ఇది తెలిసినవాడే వేదములు తెలిసినవాడు.

* అధ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః
అధశ్చ మూలా న్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే. 2

ఆ వృక్షముయొక్క శాఖలు క్రిందికిని, మీదికిని వ్యాపించియున్నవి. సత్త్వ రజ స్తమో గుణములచేత బాగుగ వృద్ధిపొందియున్నవి. శబ్దాది విషయములే చిగుళ్ళుగా ఉన్నవి. మనుష్యలోకమందు కర్మానుబంధములైన మూలములు క్రిందికిని, మీదికిని ఎడతెగక వ్యాపించియున్నవి.

* న రూప మస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాది ర్న చ సంప్రతిష్ఠా
అశ్వత్థ మేనం సువిరూఢమూల
మసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా. 3

* తతః పరం త త్పరిమార్గితవ్యం
యస్మి న్గతా న నివర్తంతి భూయః
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ. 4

ఈ సంసార వృక్షము వర్ణింపబడినరీతిగ ఇక్కడ మనకు గోచరించుటలేదు. దీని కాద్యంతములుకూడ కనుపించుటలేదు. స్థితియు తెలియుటలేదు. ఈ సంసార వృక్షమును దృఢమైన వైరాగ్యము అను ఖడ్గముచే నరికి, పునరావృత్తిరహితమైన పదమును వెదకవలయును. మరియు ఎవనినుండి అనాదియైన సంసార వృక్షముయొక్క ప్రవృత్తి బయలు వెడలి వ్యాపించినదో, అట్టి ఆదిపురుషుడైన నారాయణుని శరణు పొందవలయును.

* నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వంద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛం త్యమూఢాః పద మవ్యయం తత్. 5

అభిమాన మోహములు పోయినవారు, ఆసక్తి అను దోషమును పూర్తిగ నశింపచేసికొనినవారు, పరమాత్మయందే అచంచలముగ నిలిచియున్నవారు శబ్దాది విషయములయందలి కాంక్షలు వేళ్ళతోకూడ రూపుమాపుకొనినవారు, సుఖదుఃఖములనెడి ద్వంద్వములనుండి విముక్తులైనవారు - అట్టి మహాత్ములు అవ్యయమైన ఆ పరమపదమును పొందుచున్నారు.

* న త ద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః
య ద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ. 6

దేనిని పొందినవారు మరల తిరిగిరారో, అదియే నా పరమపద స్థానము. దానిని సూర్యుడు ప్రకాశింపజేయలేడు. చంద్రుడుగాని, అగ్నిగాని ప్రకాశింపజేయలేవు.

* మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః
మనష్షష్ఠా ణీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. 7

సనాతనుడైన ఈ జీవాత్మ, నారాయణుడనైన నాయొక్క అంశమే. ఈ జీవుడు ప్రకృతి పరిణామములైన, మనస్సుతో కూడిన, ఆరింద్రియములను, సంసారమందు భోగములనుభవించుటకై ఆకర్షించుచున్నాడు.

* శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్. 8

చందనము, పుష్పములు, కస్తూరి మొదలగు పరిమళ వస్తువుల నుండి వాయువు పరిమళమును తీసికొనిపోవుచున్న విధముగ, జీవుడు శరీరమును ప్రవేశించునపుడును, శరీరమునుండి వెడలు నపుడును మనస్సుతో కూడిన ఇంద్రియములను తీసికొనియే పోవుచున్నాడు. అనగా సూక్ష్మశరీరముతో కూడియే ప్రయాణము చేయుచున్నాడు.

* శ్రోత్రం చక్షు స్స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ
అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే. 9

ఈ జీవాత్మ, చెవి, కన్ను, చర్మము, నాలుక, ముక్కు అను జ్ఞానేంద్రియములైదింటిని, మనస్సును అధిష్ఠించి వీనిద్వారా విషయములను అనుభవించుచున్నాడు.

* ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః. 10

విషయవాసనాయత్తచిత్తులైన మూఢజనులు తమ నిజరూపమును తెలిసికొనలేక, దేహామే తామని విభ్రాంతిపడుచున్నారు. దేహ మనోబుద్ధీంద్రియములకంటె వేరైనట్టియు, సత్త్వరజస్తమో గుణములతో కూడియున్నట్టియు జీవాత్మ స్వరూపమును దేహమునందున్నప్పుడుగాని, దేహమునుండి వెడలునప్పుడుగాని, విషయముల ననుభవించునప్పుడుగాని, తెలిసికొనలేకుండ ఉన్నారు. జ్ఞానులు మాత్రము తెలిసికొనగలుగుచున్నారు.

* యతంతో యోగినశ్చైనం పశ్యం త్యాత్మ న్యవస్థితమ్
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యం త్యచేతసః. 11

జ్ఞానులు తమ నిజరూపమును తెలిసికొనుటకు ప్రయత్నించి శరీరమందున్న ఈ జీవాత్మను - అనగా తమ నిజస్వరూపమును - తెలిసికొనుచున్నారు. సాధనానుష్ఠానములచే పరిశుద్ధి చెందని అంతఃకరణము కలవారును, స్థిరతలేని చంచలచిత్తము కలవారును అగు మూఢులు ఆత్మస్వరూపమును తెలిసికొనుటకై ప్రయత్నించియు కనుగొనలేకుండ ఉన్నారు.

* య దాదిత్యగతం తేజో జగద్భాసయ తేఽఖిలమ్
య చ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్. 12

అర్జునా ! సూర్యునియందలి ఏ తేజస్సు సంపూర్ణ జగత్తును ప్రకాశింపజేయుచున్నదో, ఏ తేజస్సు చంద్రునిలోను, అగ్నిలోను కలదో ఆ తేజస్సు నాదిగనే తెలిసికొనుము.

* గా మావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః. 13

నేను భూమియందు ఆవేశించి, నాశక్తి చేతనే చరాచరభూతములనుధరించుచున్నాను. అమృతరసముతో నిండియున్న చంద్రుడనై - అనగా చంద్రునియందు ప్రవేశించి - సకలమైన ఓషధులకును వృద్ధిని కలుగజేయుచున్నాను.

* అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్. 14

నేనే జఠరాగ్నినై సకల ప్రాణుల శరీరములను ఆశ్రయించి ప్రాణాపాన వాయువులతో కూడి, భక్ష్య భోజ్య లేహ్య చోష్యము లను నాలుగు రకముల అన్నమును పచనము చేయుచున్నాను - అనగా జీర్ణము చేయుచున్నాను.

* సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ
వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో
వేదాంతకృ ద్వేద విదేవ చాహమ్. 15

సమస్త ప్రాణులయొక్క హృదయములయందును నేను వసించియున్నాను. నా వలననే సమస్తమైనవారికిని స్మృతి, జ్ఞానము, ఊహ అనునవి కలుగుచున్నవి. సకల వేదములచేతను నేనే తెలియదగినవాడను. వేదాంతములకు కర్తను నేను. వేదములను తెలిసికొనువాడను నేనే.

* ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే. 16

లోకమందు క్షరమనియు, అక్షరమనియు పురుషశబ్దముచేత చెప్పబడు రెండు వస్తువులు కలవు. ఒకటి: నశించు స్వభావముకల

సర్వభూతములును - అనగా అచేతనవర్గ మంతయును - క్షర మనబడును. రెండవది: దేహములు నశించినను నశించక నిత్యముగ ఉండు జీవసముదాయమైన బద్ధాత్మలును, ముక్తాత్మలును అక్షర మనబడును.

* ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః. 17

ఈ రెంటికిని వేరైన పురుషుడు ఒకడు కలడు. ఆ రెంటికన్న విలక్షణుడు కనుక, ఉత్తముడు అనబడుచున్నాడు. ఆ పురుషుడే మూడులోకములందును వ్యాపించి ధారణ పోషణములు చేయుటచే నాశరహితుడైన ఈశ్వరుడు పరమాత్మ అని చెప్పబడుచున్నాడు.

* యస్మాత్ క్షర మతీతో౽హ మక్షరా దపి చోత్తమః
అతో౽స్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. 18

ఆ నేను క్షరముకంటెను, అక్షరముకంటెను కూడ ఉత్తముడను అగుటచే లోకమునందును, వేదమునందునుకూడ పురుషోత్తముడు అని ప్రసిద్ధి చెందితిని.

* యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత ! 19

ఓ అర్జునా ! యథార్థతత్త్వము తెలిసిన జ్ఞానులు పురుషోత్తముడనైన నన్ను తెలిసికొని, అన్నివిధముల నన్నే భజించుచున్నారు.

* ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయానఘ !
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమా న్స్యా త్కృతకృత్యశ్చ భారత ! 20

పాపరహితుడవైన ఓ పార్థా ! నాచే చెప్పబడిన రహస్యములలో కెల్ల ఉత్తమమైన ఈ శాస్త్రమును బుద్ధిమంతుడైన పురుషుడు తెలిసికొని కృతకృత్యు డగుచున్నాడు.

ఓం తత్ సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమ ప్రాప్తి
యోగోనామ పంచదశోఽధ్యాయః

ఓం శ్రియఃపతయేనమః

ఓం శ్రీ పరమాత్మనేనమః

# శ్రీ గీతామృతము

## షోడశాధ్యాయము—దైవాసురసంపద్విభాగ యోగము

శ్రీ భగవానువాచ :

* అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగ వ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. 1

* అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్
దయా భూతే ష్వలోలు ప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్. 2

* తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత ! 3

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

అర్జునా ! దైవీసంపదను గూర్చి చెప్పెదను వినుము - భయము లేకుండుటయు, అంతఃకరణ పరిశుద్ధియు, పరమాత్మ యొక్క యథార్థతత్త్వ జ్ఞానమును పొంది, ఆ పరమాత్మను పొందుటకై తగిన భజన సంకీర్తన స్మరణ ధ్యానాది రూపమైన భక్తియోగ మందు చలించక ఉండుటయు, దానమును, ఇంద్రియనిగ్రహమును భగవద్భాగవతారాధన రూపమైన యజ్ఞమును, వేదశాస్త్రము లను అధ్యయనము చేయుటయు, తపమును, పరుల విషయమున దేహ మనోబుద్ధీంద్రియములను సరళత్వముతో ఉంచుకొనుటయు, అహింసయు, సత్యమును, కోపము లేకుండుటయు, సర్వభూతముల యందును దయయు, విషయ భోగములయం దనాసక్తియు,

మనోవాక్కాయముల ప్రవృత్తియందు కాఠిన్యము లేకుండు టయు, ధర్మమునకు విరుద్ధముగ ప్రవర్తించుటయందు లజ్జయు, చపలత్వము లేకుండుటయు, ఇతరులను మంచిమార్గమున పెట్టగల శక్తియు, ఓర్పును, ధైర్యమును, శౌచమును, ద్రోహము చేయకుండుటయు, గౌరవాదులయం దపేక్ష లేకుండుటయు- అను ఈ గుణములు అన్నియును దైవసంబంధమైన మోక్ష మనుభ వించుటకై పుట్టినవానికి కలుగుచున్నవి. అనగా. ఈ లక్షణములు కలవాడు తప్పక మోక్షమును పొందును. కనుక ఈ గుణములు దైవీసంపద అనబడుచున్నవి.

* దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ
అజ్ఞానం చాభిజాతస్య పార్థ ! సంపద మాసురీమ్. 4

అర్జునా ! లేని గొప్పతనము ను ప్రకటించుకొనుటయు, గర్వమును, అభిమానమును, కోపమును, కఠినత్వమును, అజ్ఞానమును - సత్యాసత్యములు, ధర్మాధర్మములు, కర్తవ్యాకర్తవ్యములు తెలిసికొనలేకపోవుట అను విపరీత జ్ఞానమును అజ్ఞానమందురు - అను ఈ గుణములు ఆసురీలోకము లనబడు నరకములను అనుభవించుటకై పుట్టినవారికి కలుగును. కనుక ఈ గుణములకు ఆసురీసంపద అను పేరు కలిగెను.

* దైవీ సంప ద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా
మా శుచ స్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ ! 5

దైవీసంపద మోక్షమునకును, ఆసురీసంపద బంధనమునకును కారణమగుచున్నది. కాబట్టి అర్జునా ! నీవు విచారపడవలసిన అవసరములేదు. నీవు దైవీసంపదకు సంబంధించిన గుణములు కలిగియున్నావు.

* ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ ! మే శృణు. 6

అర్జునా ! ఈ లోకమున దైవీసంపద కలిగినట్టియు, ఆసురీసంపద కలిగినట్టియు రెండురకములైన మానవులు కలరు. దైవీసంపద కలవారిని గూర్చి వివరముగ చెప్పితిని. ఆసురీసంపదకు సంబంధించిన వారినిగూర్చి చెప్పెదను వినుము.

* ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే. 7

వారికి ప్రవృత్తి అన నేమో, నివృత్తి అన నేమో తెలియదు. బాహ్యాభ్యంతరశుద్ధిలేదు. సదాచారములేదు. సత్యమనునది ఏమాత్రమును లేదు.

* అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్
అపరస్పరసంభూతం కిమన్య త్కామహైతుకమ్. 8

ఇంకను వారు జగత్తున కాశ్రయమే లేదందురు. కేవల మసత్యమనియు, దీని కీశ్వరుడే లేడనియు అందురు. అయినచో ఈ జగత్తు ఎట్లు కలిగినదని ప్రశ్నించిన, స్త్రీ పురుష సాంగత్యమువలననే కలిగినదనియు, కామోపభోగము లనుభవించుటకొరకే ఇది ఏర్పడినదనియు, ఇంతకంటె వేరేమియు లేదనియు అందురు.

* ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః. 9

విపరీతమైన ఇట్టి నాస్తిక జ్ఞానమును అవలంబించుటచే, వారికి పరమార్థ జ్ఞానము నశించినది. బుద్ధికూడ మందగించినది. కాబట్టి ఇది మంచి, ఇది చెడ్డ, ఇది మేలు, ఇది చెరుపు అని

తెలిసికొనలేక, తమకును లోకమునకునుకూడ నష్టము కలుగ జేయు భయంకరకర్మలు చేయుచున్నారు. ఇట్టి పాపులు లోకముయొక్క నాశము కొరకే పుట్టుచున్నారు.

* కామ మాశ్రిత్య దుష్పూరం దంభ మాన మదాన్వితాః
మోహా ద్గృహీత్వా సద్గ్రాహా స్ప్రవర్తంతేఽశుచివ్రతాః. 10

దుఃఖము, మానము, మదము-వీటితో కూడియున్న ఆ మానవులు, బ్రహ్మలోక పర్యంతమైన లోకాధిపత్యము లన్నియును తమ చేత చిక్కినను తృప్తిపొందని కామము నాశ్రయించి, అజ్ఞానమువలన శాస్త్రవిరుద్ధములైన సిద్ధాంతములు గ్రహించినవారై, శౌచము లేని వ్రతములు కలవారై ప్రవర్తించుచున్నారు.

* చింతా మపరిమేయాం చ ప్రలయాంతా ముపాశ్రితాః
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః. 11

అపరిమితమును, మరణ పర్యంతము విడువనిదియును అగు చింత కలవారై, కామోపభోగములే పరమార్థములనియు అంతకంటె పరమార్థము వేరుగ లేదనియు నిశ్చయము కలవారై ఉందురు.

* ఆశా పాశ శతై ర్బద్ధాః కామ క్రోధ పరాయణాః
ఈహంతే కామభోగార్థ మన్యాయే నార్థ సంచయాన్. 12

వారు అనంతములైన ఆశాపాశములచేత బంధింపబడి, కామక్రోధ పరాయణులై, కామోపభోగములకొరకు అన్యాయముగ ధనము సంపాదించుటకు ప్రయత్నములు చేయుచుందురు.

* ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్
ఇద మ స్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్. 13

* అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరానపి
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ. 14

* ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః. 15

* అనేక చిత్తవిభ్రాంతా మోహజాల సమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ. 16

"నేడు ఇది పొందితిని, ఈకోరిక ఇప్పుడు పొందగలను. ఈధనము నావద్ద ఉన్నది. ఆ ధనముకూడ నాదే అగును. ఈ శత్రువును నేను చంపితిని. వారినికూడ చంపివేయుదును. నేనే ఈశ్వరుడను. నేనే భోగిని. నేనే సిద్ధుడను. బలవంతుడను. సుఖము కలవాడను. సకలమైన ఐశ్వర్యములతో తులతూగుచున్నాను. ఉత్తమ కులమున పుట్టినవాడను. నాతో సమానుడైనవా డెవ్వడును లేడు. యజ్ఞములు చేయుదును. దానము లిచ్చెదను. ఆనంద మనుభవించెదను" - అని ఈవిధముగ అజ్ఞానముచే భ్రాంతిచెందినవారై తలచెదరు. అనేక విధములైన చిత్తచాంచల్యము కలవారును, అజ్ఞానమను వలలో చిక్కుపడినవారును, విషయోపభోగము లందే అత్యంతాసక్తి కలిగినవారును అయిన అసురభావముగల నరులు, నానావిధములైన అపరిశుద్ధములైన నరకములందు పడుచున్నారు.

* ఆత్మసంభావితాః స్తబ్ధా ధన మాన మదాన్వితాః
యజంతే నామయజ్ఞైస్తే దంభే నావిధిపూర్వకమ్. 17

ఇట్టి అసుర భావముకల మానవులు, తమ్ము తామే పొగడుకొనుచు, ధనవంతులమనియు, గొప్ప కులమందు పుట్టితిమనియు మదించి ఇతరులయందు పూజ్యభావము లేక, పేరు ప్రతిష్ఠలకొరకు నామ

మాత్రసత్కార్యములను దంభముతోను శాస్త్రమునకు విరుద్ధము గను చేయుచున్నారు.

* అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః
మా మాత్మ పరదేహేషు ప్రద్విషంతో ఽభ్యసూయకాః. 18

అహంకారమును, బలమును, గర్వమును, కామమును, క్రోధమును కల, ఆసురభావముతో నిండిన ఈ మానవులు, తమ యందును ఇతరులయందును కూడ వ్యాపించియున్న నన్ను అసూయచే ద్వేషించుచున్నారు.

* తా నహం ద్విషతః క్రూరా న్సంసారేషు నరాధమాన్
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు. 19

ద్వేషపూర్ణులును, పాపకర్మములే చేయువారును, క్రూరులును అగు ఈ మానవాధములను, మాటిమాటికి జనన మరణ రూపమైన సంసారములో అసుర సంబంధమైన నీచజన్మలందు త్రోయుచున్నాను.

* ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని
మా మప్రాప్యైవ కౌంతేయ! తతో యాంత్యధమాంగతిమ్.20

ఆ మూఢజనులు ప్రతిజన్మములోను ఇట్టి నీచయోనులందు పుట్టుచు, నన్ను పొందకయే అధోగతుల పాలగుచున్నారు.

* త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్.21

కామము, క్రోధము, లోభము అను ఈ మూడు గుణములును, ఆత్మ నధోగతిపాలు చేయునవియును, నరకమునకు ద్వారములును అయి ఉన్నవి. కాబట్టి ఈ మూటిని త్యజించవలయును.

* ఏతై ర్విముక్తః కౌంతేయ ! తమోద్వారై స్త్రిభి ర్నరః
ఆచర త్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్. 22

అర్జునా ! నరకద్వారములైన ఈ మూడుగుణములను పూర్తిగ త్యజించిన మానవుడే, తన శ్రేయస్సునకు ప్రయత్నముచేసి పరమగతికి పోవుచున్నాడు.

* య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. 23

ఎవడు విషయోపభోగములందలి కాంక్షచేత శాస్త్రవిధిని విడిచి ప్రవర్తించుచున్నాడో, వాడు సిద్ధిని పొందడు. వానికి సుఖమును లేదు, పరమగతియును దొరకదు. రెంటికిని చెడుచున్నాడు.

* తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధా నోక్తం కర్మ కర్తు మిహార్హసి. 24

అర్జునా ! ఇది చేయదగినది, ఇది చేయుదగనిది అని నిర్ణయించుటకు శాస్త్రమే ప్రమాణము. కనుక, శాస్త్రవిధిని తెలిసికొని కర్మ చేయుము.

ఓం తత్ సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే దైవాసుర
సంప ద్విభాగ యోగోనామ షోడశోఽధ్యాయః

ఓం శ్రీయఃపతయేనమః
ఓం శ్రీ పరమాత్మనేనమః

# శ్రీ గీతామృతము

## సప్తదశాధ్యాయము – శ్రద్ధాత్రయ విభాగయోగము

అర్జున ఉవాచ :

* యే శాస్త్రవిధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వ మాహో రజ స్తమః. 1

అర్జునుడు అడుగుచున్నాడు :

ఓ కృష్ణా ! శాస్త్రవిధిని విడిచి, శ్రద్ధావంతులై దేవపూజ, యజ్ఞయాగాదులు మొదలైన కర్మలు చేయువారి స్థితి, ఏ గుణము నకు సంబంధించినది? సాత్త్వికమా? రాజసమా? లేక తామసమా?

శ్రీ భగవానువాచ :

* త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. 2

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

కేవలము మానవులయొక్క స్వభావముచేతనే కలిగిన ఆ శ్రద్ధ, సాత్త్వికము, రాజసము, తామసము అని మూడువిధములుగ ఉండును. దీనిని చెప్పుచున్నానువినుము.

* సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత !
శ్రద్ధామయోఽ-యం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః. 3

అర్జునా ! సకల మానవులకును వారివారి అంతఃకరణము ననుసరించి శ్రద్ధ కలుగుచున్నది. పురుషుడు శ్రద్ధామయుడు-అనగా శ్రద్ధయే

స్వరూపముగ కలవాడు. కాబట్టి, శ్రద్ధ ఎట్టిదో, పురుషుని స్థితి కూడ అట్టిదే.

* యజంతే సాత్త్వికా దేవా న్యక్ష రక్షాంసి రాజసాః
ప్రేతా న్భూతగణాం శ్చాన్యే యజంతే తామసా జనాః. 4

సాత్త్వికశ్రద్ధ కలవారు దేవతలను పూజింతురు. రాజసశ్రద్ధ కలవారు యక్షులను, రాక్షసులను పూజింతురు. తామసశ్రద్ధ కలవారు ప్రేతములను, భూతగణములను పూజింతురు.

* అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః
దంభాహంకారసంయుక్తాః కామ రాగ బలాన్వితాః 5

* కర్శయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః
మాం చైవాంతశ్శరీరస్థం తా న్విద్ధ్యాసురనిశ్చయాన్. 6

దంభాహంకారములతోను, కామ రాగ బలాభిమానములతోను కూడి, శాస్త్ర విరుద్ధమైన ఘోరతపస్సులను చేయుచు, శరీరమును కృశింపజేయుచు తమలో ఉన్న సర్వాంతర్యామినైన నన్ను కూడ దుఃఖింపజేయువారిని - అట్టి అజ్ఞానులను - అసురభావము కలవారుగా తెలిసికొనుము.

* ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు. 7

వారి వారి స్వభావములనుబట్టి సర్వులకును ఆహారముకూడ మూడురకములు. అట్లే యజ్ఞము, దానము, తపస్సు కూడ మూడురకములుగ ఉన్నవి.

* ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః
రస్యా స్స్నిగ్ధా స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్విక ప్రియాః. 8

ఆయుష్షును, బుద్ధిని, బలమును, ఆరోగ్యమును, సుఖమును, ప్రేమను వృద్ధిపరచునట్టియు, రసము, చమురు కలట్టియు, స్థిరములైనట్టియు-ఏ వస్తువులు భుజించుటచే కలిగిన సారము శరీరమున చాల కాల ముండునో, ఆ వస్తువులు స్థిరములని భావము-మనోహరము లైనవియు అగు పదార్థములతో కూడిన ఆహారము సాత్త్విక మైనది.

* కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః
ఆహారా రాజసస్యేష్టా దుఃఖ శోకామయ ప్రదాః 9

చేదు, పులుపు, ఉప్పు, మిక్కిలి వేడి, కారము కలవియు, ఎండిపోయినవియు - రొట్టెలు మొదలైనవి - అతిదాహమును కలుగజేయునవియు అగువానితో కూడిన ఆహారము రాజస మైనది. ఇట్టి ఆహారము దుఃఖమును, శోకమును, రోగమును కలిగించును.

* యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్. 10

సరిగ ఉడుకనిదియు, రసము పూర్తిగ పోయినదియు, పాచిపోయి నదియు, దుర్గంధముతో కూడినదియు, గురువులు, భర్తలు మొదలగు దైవసమానులుగాక, మిగిలినవారి ఎంగిలియు, అపవిత్రమైనదియు అగు ఆహారము తామసమైనది.

* అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్యమే వేతి మనః సమాధాయ స సాత్త్వికః. 11

మనస్సును నియమించుకొని, ఫలమందు ఆసక్తిలేక, తన విధియని తెలిసికొని శాస్త్రవిహితమైన యజ్ఞము చేసిన అది సాత్త్విక మైనది.

* అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ ! తం యజ్ఞం విద్ధి రాజసమ్. 12

ఫలమునందు ఆసక్తితోను, తన గొప్పతనమును ప్రకటించుకొనుటకును చేయు యజ్ఞము రాజసమైనది.

* విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. 13

శాస్త్రవిధిని అతిక్రమించి చేసినదియు, అన్నదానము లేనిదియు, మంత్రహీనమైనదియు, తగిన దక్షిణ లేనిదియు, శ్రద్ధావిరహితమైనదియు అగు యజ్ఞము తామసమైనది. ఇచ్చట యజ్ఞములనగా, సకలమైన సత్కర్మలు అని తెలిసికొనవలయును.

* దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే. 14

దైవమును, బ్రాహ్మణులను, గురువును, సాధువులను పూజించుట, బాహ్యాభ్యంతర శుచిత్వము, మృదుత్వము, బ్రహ్మచర్యము, అహింస అనునవి శారీరక తపస్సు అనబడును.

* అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియ హితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. 15

ఇతరుల మనస్సు నొప్పింపక, సత్యముగ, ప్రియముగ, హితముగ మాటాడుటయు, వేదాంత గ్రంథములను పఠించుటయు వాగ్రూపమైన తపస్సు అనబడును.

* మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే. 16

మనోనిర్మలత్వమును, శాంతభావమును, మౌనమును, మనస్సును వశము చేసుకొనుటయు, పరిశుద్ధమైన భావములు కలిగి యుండుటయు, మానసిక తపస్సు అనబడును.

* శ్రద్ధయా పరయా తప్తం తప స్తత్ త్రివిధం నరైః
అఫలాకాంక్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే. 17

ఈ మూడువిధములైన తపస్సులనుకూడ ఫలాపేక్ష లేక, మిక్కిలి శ్రద్ధతోడను, పరమాత్మ ధ్యానముతోడను చేసిన యెడల, అది సాత్త్విక తపస్సు అని చెప్పబడును.

* సత్కార మాన పూజార్థం తపో దంభేన చైవ యత్
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్. 18

ఇతరులచేత సత్కరింపబడుటకును, గౌరవింపబడుటకును, పూజింపబడుటకును, దంభము కొరకును చేయునదియు, చంచలమైనదియును, దృఢత్వము లేనిదియు అగు తపస్సు రాజసికము అనబడును.

* మూఢగ్రాహే ణాత్మనో య త్పీడయా క్రియతే తపః
పర స్యోత్సాదనార్థం వా త త్తామస ముదాహృతమ్. 19

మూర్ఖపు పట్టుదలతో కూడినదియు, తనకు కష్టము కలుగజేయునదియును, ఇతరుల నాశముకొరకు చేయునదియు అగు తపస్సు తామసికము అని చెప్పబడును.

* దాతవ్య మితి య ద్దానం దీయతేఽనుపకారిణే
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్. 20

దేశ కాల పాత్రల నాలోచించి, ప్రత్యుపకారము కోరక చేయబడిన దానము సాత్త్వికము.

* యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం త ద్దానం రాజసం స్మృతమ్. 21

ప్రత్యుపకారము కోరిగాని, ఫలమును కోరిగాని, కష్టముతో చేసిన దానము రాజసికము.

* అదేశకాలే య ద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం త త్తామస ముదాహృతమ్. 22

దేశ కాల పాత్రలను ఆలోచింపక, గౌరవము లేక, అవమానము చేయుచు ఇచ్చిన దానము తామసికము.

* ఓం తత్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. 23

వేదమునకు 'ఓమ్' అనియు, 'తత్' అనియు, 'సత్' అనియు మూడువిధములుగా నిర్దేశము కలదు. పూర్వమందు బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములును వీటిచేతనే నిర్మింపబడినవి.

* తస్మా దోమి త్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః
ప్రవర్తంతే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్. 24

కనుక వేదోక్తాచరణముగల సత్పురుషులు ఎల్లప్పుడు, శాస్త్ర విహితములైన యజ్ఞ దాన తపోరూపములైన కర్మలు ముందుగా 'ఓమ్' అని ఉచ్చరించియే ప్రారంభించుచున్నారు.

* త దిత్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః. 25

మోక్షాభిలాషగల ముముక్షువులు ఫలాభిలాష లేక యజ్ఞ దాన తపోరూపములగు సమస్తకర్మలును, సమస్తమును పరమాత్మ యను భావముతో 'తత్' అని ఉచ్చరించియే చేయుచున్నారు.

* సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే. 26

'సత్' అను పదము 'కలదు' అను అర్థమునందును, 'మంచిది' అను అర్థమునందును ప్రయోగింపబడుచున్నది. కనుక అర్జునా! ఉత్తమ కర్మలకు 'సత్' అను శబ్దము ప్రయోగింపబడుచున్నది.

* యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే. 27

యజ్ఞ దాన తపస్సులందు గల నిష్ఠ 'సత్' అని చెప్పబడుచున్నది. పరమాత్మకొరకు చేయబడిన కర్మ నిశ్చయముగ 'సత్' అనియే చెప్పబడుచున్నది.

* అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్
అసదిత్యుచ్యతే పార్థ! న చ తత్ప్రేత్యనో ఇహ. 28

అర్జునా! శ్రద్ధలేక అవిశ్వాసముతో చేయబడిన హోమము, దానము, తపస్సు మొదలుగాగల కర్మలన్నియును 'అసత్' అని చెప్పబడుచున్నవి. ఆ కర్మల వలన ఈ లోకమునగాని, మరణానంతరము పరలోకమునగాని ఏమాత్రమును లాభము లేదు.

ఓం తత్ సత్

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయ
విభాగయోగో నామ సప్తదశోఽధ్యాయః

ఓం శ్రియఃపతయే నమః
ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీ గీ తా మృ త ము

## అష్టాదశాధ్యాయము – మోక్షసన్న్యాసయోగము

అర్జున ఉవాచ :

* సన్న్యాసస్య మహాబాహో! తత్త్వ మిచ్ఛామి వేదితుమ్
త్యాగస్య చ హృషీకేశ ! పృథక్కేశినిషూదన ! 1

అర్జునుడు అడుగుచున్నాడు :

కృష్ణా ! నేను సన్న్యాసముయొక్కయు, త్యాగము యొక్కయు యథార్థ తత్త్వమును వేరు వేరుగ తెలిసికొనగోరుచున్నాను.

శ్రీ భగవానువాచ :

* కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః. 2

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :

కామ్యకర్మలను త్యజించుటయే సన్న్యాసమనియును సర్వ కర్మల యొక్కయు ఫలములను త్యజించుటయే త్యాగమనియును విచారణశీలురైన పండితులు చెప్పుచున్నారు.

* త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః
యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్య మితి చాపరే. 3

కొందరు కర్మలన్నియు దోషయుక్తములైనవే కనుక వాటిని స్వరూపముతో కూడ విడువవలసినదే యని చెప్పుచున్నారు. మరి కొందరు యజ్ఞ తపో దానాది కర్మలను త్యజించరాదని చెప్పుచున్నారు.

* నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ !
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః. 4

అర్జునా ! ఈ విషయమున నా నిశ్చితాభిప్రాయమును వినుము - త్యాగము కూడ మూడువిధములు.

* యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. 5

యజ్ఞ దాన తపో రూపమైన కర్మలు విడువతగినవికావు. తప్పక చేయవలసినవే. ఫలాభిలాషలేక చేయువారికి యజ్ఞ దాన తపములు చిత్తశుద్ధి కలుగజేయునవి కనుక పవిత్రములైనవి.

* ఏతా న్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ
కర్తవ్యా నీతి మే పార్థ ! నిశ్చితం మత ముత్తమమ్. 6

ఈ కర్మల నన్నిటిని ఆసక్తియు, ఫలాభిలాషయు విడిచి తప్పక చేయవలయును. అర్జునా ! ఇది ఉత్తమము, నిశ్చితము అగు నా అభిప్రాయము.

* నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే
మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః. 7

శాస్త్రవిహితములైన కర్మలను స్వరూపముతో విడుచుట యుక్తముకాదు. అజ్ఞానమువలన ఆ కర్మలను విడిచిన, దానికి తామస త్యాగము అని పేరు.

* దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. 8

కర్మలు చేయుటచే శరీరమునకు కష్టము కలుగుననియు, కర్మలన్నియు దుఃఖరూపములే అనియు తలచి కర్మలు ఆచరింపక

విడిచినచో నట్టిది రాజసత్యాగము అనబడును. ఆ విడిచినవానికి ఆ త్యాగమువలన ఏమాత్రమును ఫలములేదు.

* కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున !
సంగం త్యక్త్వా ఫలంచైవ స త్యాగ స్సాత్త్వికో మతః. 9

శాస్త్రవిహితమైన కర్మ తప్పక చేయదగినదే అను భావముతో ఆసక్తిని, ఫలాభిలాషను విడిచి చేసినచో - అది ఆసక్తిని ఫలాభిలాషను త్యజించుట-సాత్త్విక త్యాగము అని తెలిసికొనవలయును.

* న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. 10

సత్త్వసంపన్నుడును, యథార్థ తత్త్వజ్ఞానియును సంశయ రహితుడును అగు త్యాగి, కామ్య నిషిద్ధము లనబడు అకుశల కర్మల యందు ద్వేషమును పూనడు; నిత్య నైమిత్తికాది శాస్త్రవిహితమైన కర్మలయం దాసక్తిని పూనడు. వానికి రాగద్వేషములు రెండును ఉండవు.

* న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే. 11

దేహధారులకు కర్మలు పూర్తిగ విడుచుటకు శక్యము కాదుగదా! కాబట్టి, కర్మఫలములను త్యజించుచున్నవాడే త్యాగి అని చెప్పబడుచున్నాడు.

* అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్
భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్. 12

ఫలత్యాగము చేయక కర్మము లాచరించువారికి ఇష్టములు, అనిష్టములు ఇష్టానిష్ట మిశ్రములు అగు మూడువిధములైన

ఫలములు మరణానంతరము లభించుచున్నవి. సన్న్యాసులను మాత్ర మెప్పుడును కర్మఫలము బంధించలేదు.

* పంచైతాని మహాబాహో! కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. 13

అర్జునా! సకల కర్మల ఉత్పత్తికిని వేదాంత శాస్త్రమునందు అయిదు కారణములు చెప్పబడినవి. వాటిని నీకు తెలిపెదను.

* అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్. 14

* శరీర వాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. 15

మానవులు - శాస్త్రీయమైనదికాని, అశాస్త్రీయమైనదికాని - ఏకర్మ చేసినను, దానికి కారణములు అయిదు. శరీరము, కర్తయైన జీవాత్మ, కర్మేంద్రియ జ్ఞానేంద్రియ మనోబుద్ధ్యహంకారాదులు, అనేకవిధములైన వేరువేరు చేష్టలు, దైవము అను ఈ అయిదును కర్మలకు హేతువు లగుచున్నవి.

* తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః
పశ్య త్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః. 16

సత్యము ఇట్లుండగ, కేవలము పరిశుద్ధ చైతన్య స్వరూపమైన ఆత్మను ఒక్కదానినె కర్తగ తలచువాడు మూర్ఖుడు. అపరిశుద్ధమైన బుద్ధి కలవాడగుటచే అట్లు భావించు దుర్మతి యథార్థమును తెలిసికొనలేడు.

* యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే
హత్వాపి స ఇమాంల్లోకా న్న హంతి న నిబధ్యతే. 17

"నేను చేయుచున్నాను" అను కర్తృత్వాభిమానము లేని వాడు - కర్మఫలమునందును, కర్మయందును ఆసక్తము కాని బుద్ధికలవాడు- అట్టివాడీ లోకములను అన్నిటిని చంపినను, వాస్తవమున చంపినవాడు కాడు. పాపముచేత బంధింపబడడు.

* జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః. 18

కర్మను ప్రేరేపించునవి జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత అని మూడు విధములు. కర్త, కర్మ, కరణము అని కర్మసంగ్రహము మూడు విధములు.

* జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణ సంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి. 19

గుణములనుగూర్చి చెప్పు శాస్త్రమునందు, గుణభేదముచేత జ్ఞానము మూడువిధములనియు, కర్మ మూడు విధములనియు, కర్త మూడు విధములనియు చెప్పబడి యున్నది. దానిని చక్కగ చెప్పెదను. శ్రద్ధాయుక్తుడవై వినుము.

* సర్వభూతేషు యే నైకం భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు తత్ జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. 20

ఏ జ్ఞానముచేత మానవుడు అనేక రకములుగ విభజింపబడియున్న సర్వభూతములందును ఒకేభావమును - అనగా సమత్వమును- అచంచలముగ కలిగియుండునో, ఆ జ్ఞానము సాత్త్వికమైనదిగ తెలిసికొనుము.

* పృథక్త్వేన తు యత్ జ్ఞానం నానాభావా న్పృథగ్విధాన్
వేత్తి సర్వేషు భూతేషు తత్ జ్ఞానం విద్ధి రాజసమ్. 21

సమస్త భూతములందును, గొప్పకులము వారనియు, నీచకులము వారనియు, మానవులనియు, పశు పక్షి మృగాదులనియు - ఈ విధములుగ హెచ్చుతగ్గులతోడి నానావిధ భావమును కలిగించు జ్ఞానము రాజసమైనదిగ తెలిసికొనుము.

* యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహైతుకమ్
అతత్త్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతమ్. 22

ప్రకృతియొక్క కార్యరూపమైన ఈ శరీరమును గూర్చి ఇదియే సర్వస్వము అను పూర్ణభ్రాంతిని కలుగజేయునట్టియును, యుక్తి రహితమైనట్టియును యథార్థ తత్త్వజ్ఞానమునకు విపరీతమైనట్టి యును, తుచ్ఛమైనట్టియును జ్ఞానము-అనగా విపరీత జ్ఞానము-తామసికమైనదిగ తెలియుము.

* నియతం సంగరహిత మరాగద్వేషతః కృతమ్
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే. 23

కర్తృత్వాభిమానములేక, రాగద్వేషములు లేక, ఫలాపేక్ష లేక చేయబడిన శాస్త్రవిహితకర్మ సాత్త్వికమైనది అని చెప్పబడు చున్నది.

* యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్. 24

ఎక్కువ శ్రమతో కూడుకొన్నదియును, కామ్యభోగములయం దపేక్షతోను, అహంకారముతోను చేయబడినదియును అగు కర్మ రాజసమైనదిగ చెప్పబడుచున్నది.

* అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్
మోహా దారభ్యతే కర్మ యత్తత్తామస ముచ్యతే. 25

ఫలమునుగాని, హానినిగాని, హింసనుగాని, తన సామర్థ్యమును గాని విచారింపక మోహముచేత ఆరంభింపబడిన కర్మ తామసిక మైనది అని చెప్పబడుచున్నది.

* ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. 26

కర్మలయందుగాని, ఫలమునందుగాని ఆసక్తి లేక కర్తృత్వాభిమానము లేక ధైర్యోత్సాహ సంపన్నుడై, తాను చేయు కార్యము నెరవేరినను నెరవేరకపోయినను చలించక ఉండు కర్తను సాత్త్వికుడని తెలియుము.

* రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః 27

కర్మలందును, ఫలములందును ఆసక్తి కలిగి, పిసినిగొట్టుతనము కలిగి, ఇతరులను బాధించు స్వభావముకలిగి, అపవిత్రుడై తాను చేయు కార్యములు నెరవేరిన సంతోషమును, చెడిపోయిన దుఃఖమును పొందు కర్త రాజసుడు అని చెప్పబడుచున్నాడు.

* అయుక్తః ప్రాకృత స్స్తబ్ధ శ్శఠో నైష్కృతికోఽలసః
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. 28

అయోగ్యుడు, వాసనాదుష్టమైన బుద్ధికలవాడు, సోమరి, మూర్ఖుడు, ఇతరుల మోసగించువాడు, పనులు చేయుటయందు మందబుద్ధి గలవాడు, రాత్రింబవళ్ళు ఖేదపడుచుండువాడు, పనులు చేయుటలో 'నేడు కాదు, రేపు; రేపు కాదు, మాపు' అని దీర్ఘకాలము జరుపువాడు అగు కర్త తామసుడు అని చెప్పబడుచున్నాడు.

* బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ ! 29

అర్జునా! బుద్ధియును, ధైర్యమునుకూడ గుణభేదములనుబట్టి మూడువిధములైనవి. వాటిని పూర్తిగ విభజించి నీకు చెప్పెదను వినుము.

* ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ. 30

ప్రవృత్తి అనగ ఏమో, నివృత్తి అనగ ఏమో, ఏది చేయదగినదో, ఏది చేయదగనిదో, ఏది భయమును కలుగజేయునో, ఏది అభయమును కలుగజేయునో, బంధమనగ ఏమో, మోక్షమనగ ఏమో- చక్కగ విచారించి తెలిసికొనగల బుద్ధి సాత్త్వికమైనది.

* యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ! రాజసీ. 31

ధర్మమనగ ఏమో, అధర్మమనగ ఏమో, ఏ కార్యము చేయదగినదో, ఏది చేయరానిదో, యథార్థమును తెలిసికొనలేని బుద్ధి రాజసమైనది.

* అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ! తామసీ. 32

అధర్మమునే ధర్మమని నిర్ణయించునట్టియు, సర్వ పదార్థములను విపరీతముగ గ్రహించునట్టియు, తమస్సుచేత ఆవరింపబడినట్టియు బుద్ధి తామసికమైనది.

* ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియక్రియాః
యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ! సాత్త్వికీ. 33

ఓ పార్థా! మనస్సుయొక్కయు, ప్రాణములయొక్కయు, ఇంద్రియములయొక్కయు క్రియలను చక్కగ భగవద్ధ్యానముచే నియమించుటకు తగిన, చలించని ధైర్యము సాత్త్వికమైనది.

* యయా తు ధర్మ కామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున !
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ! రాజసీ. 34

అమితాసక్తి కలవాడై, ధర్మార్థ కామములనెడి త్రివర్గమునే పరమపురుషార్థముగ ఎంచు ఫలాభిలాషి ధైర్యము రాజసమైనది.

* యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ
న విముంచతి దుర్మేధా ధృతిః సా పార్థ ! తామసీ. 35

బుద్ధివిహీనుడై, నిద్ర, భయము, దుఃఖము, విచారమును విడువక ఉండువాని ధైర్యము తామసికమైనది.

* సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ !
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి. 36

* యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మ బుద్ధి ప్రసాదజమ్. 37

అర్జునా ! సుఖముకూడ ఇట్లే మూడువిధములు. అది కూడ చెప్పెదను వినుము - సాధకుడు చక్కని అభ్యాసములవలన ఏ సుఖమునం దానందించుచుండునో, దేనియందు సాధకుడు సర్వదుఃఖనివృత్తిని పొందునో, ఏది మొదట - అనగా సాధన కాలమందు - కష్టమై తోచినను, చివర కమృతముతో సమమై యుండునో, అట్టి సుఖము సాత్త్వికమైనది.

* విషయేంద్రియ సంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్. 38

ఇంద్రియముల ద్వారమున విషయము లనుభవించుటచే మొదట అమృతోపమువలెను, చివరకు విషమువలెను ఉండునట్టి సుఖము రాజసిక సుఖము.

* యదగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్. 39

ఏ సుఖము మొదటను, చివరను, అనుభవకాలములోను కూడ తనను మోహములోముంచి, ఆత్మోన్నతినుండి పతనమును కలుగ జేయునో, అట్టి సుఖము - అనగా నిద్ర, సోమరితనము, ప్రమాదము మొదలగువాటివలన గలుగు సుఖము - తామసము.

* న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభి స్స్యాత్త్రిభిర్గుణైః 40

భూలోకమునందుగాని, స్వర్గాది లోకములందుగాని ఉన్న ప్రాణిసమూహములో, ఈ సత్త్వరజస్తమోగుణములచే కట్టుబడని దొకటియును లేదు.

* బ్రాహ్మణ క్షత్త్రియ విశాం శూద్రాణాం చ పరంతప !
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై ర్గుణైః. 41

బ్రహ్మ క్షత్త్రియ వైశ్య శూద్రు లను నాలుగు జాతులకును కూడ, వారి వారి స్వభావములవలన పుట్టిన గుణములచేత వారి వారికి తగిన కర్మలు విభజింపబడి యున్నవి.

* శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్. 42

శమము, దమము, తపము, శౌచము, ఓర్పు, మనోబుద్ధీంద్రియముల సరళత్వము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము మొదలైనవి బ్రాహ్మణులకు తగిన కర్మలు.

* శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చా ప్యపలాయనమ్
దాన మీశ్వరభావశ్చ క్షాత్త్రం కర్మ స్వభావజమ్. 43

శౌర్యము, తేజము, ధైర్యము, సమర్థత, యుద్ధమునందు పారిపోకుండుట, దానము, స్వామిత్వము - ఇవి క్షత్రియులకు తగిన కర్మలు.

* కృషి గౌరక్ష్య వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్. 44

వ్యవసాయము, గోవులను పాలించుట, వాణిజ్యము వైశ్యులకు తగిన కర్మలు. సేవచేయుట శూద్రులకు తగిన కర్మ.

* స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. 45

తమ తమ వర్ణాశ్రమ కర్మలను, తమ విధిప్రకార మాచరించుట చేతనే మానవులు సిద్ధిని పొందుచున్నారు. స్వకర్మను ఆచరించుట చేత మానవుడు సిద్ధిని ఎట్లు పొందుచున్నాడో వినుము.

* యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. 46

ఎవనినుండి సర్వభూతములు కలిగినవో, ఎవనిచేత ఈ సర్వము వ్యాప్తమై ఉన్నదో, అట్టి పరమాత్మను తమ తమ వర్ణాశ్రమ విహితమైన కర్మలచే అర్చించి, మానవులు సిద్ధినిపొందుచున్నారు.

* శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. 47

బాగుగా అనుష్ఠింపబడిన పరధర్మముకంటె, గుణహీనమైనను స్వధర్మమే శ్రేయస్సును కూర్చునది. తనకు విధింపబడిన కర్మలను ఆచరించినవాడు పాపములచే బంధింపబడడు.

* సహజం కర్మ కౌంతేయ ! సదోషమపి న త్యజేత్
సర్వారంభా హి దోషేణ ధూమే నాగ్ని రి వావృతాః. 48

దోషయుక్తమైనను తన వర్ణాశ్రమవిహితకర్మమును వదలరాదు. ఏలయన, అగ్ని పొగచేత కలిసియున్నట్లు సర్వకర్మలును, దోషయుక్తములైనవే.

* అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి. 49

వాసనారహితమైన బుద్ధి కలిగినట్టియు, శరీర మనో బుద్ధీంద్రియములను జయించినట్టియు, ప్రాపంచిక విషయానుభవమం దేమాత్రము స్పృహ లేనట్టియు పురుషుడు, సన్న్యాసయోగముచే పరమనైష్కర్మ్యసిద్ధిని పొందుచున్నాడు.

* సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే
సమాసేనైవ కౌంతేయ ! నిష్ఠా జ్ఞానస్య యా పరా. 50

తన వర్ణాశ్రమ విహిత కర్మల నాచరించుటచే అంతఃకరణశుద్ధి పొందిన వాడే లక్షణములు కలిగియుండి పరమాత్మను పొందునో, అట్టి జ్ఞానముయొక్క చరమదశను గూర్చి సంక్షేపముగ చెప్పుచున్నాను వినుము.

* బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ
శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. 51

* వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. 52

* అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే. 53

పరిశుద్ధమైన బుద్ధితో, ధైర్యముతో మనస్సును నిగ్రహించి, శబ్దాది విషయవాంఛలు త్యజించి, రాగద్వేషములు విడిచి, ఏకాంతము కోరుచు, తేలికయైన ఆహారమును భుజించుచు, శరీర వాఙ్మానసములను నియమించి ధ్యానయోగమందే పరతంత్రుడై, సర్వకాల సర్వావస్థలయందును పరిపూర్ణ వైరాగ్యనిష్ఠుడై, అహంకార బల దర్ప కామ క్రోధ పరిగ్రహములను విడిచిన, మమకార రహితుడై, శాంతుడై ఉండువాడు - ఇట్టి లక్షణములతో కూడినవాడు పరబ్రహ్మమును పొందుటకు అర్హుడగుచున్నాడు.

* బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. 54

పరమాత్మయందే నిలకడను పొందిన ప్రసన్నచిత్తు డెప్పుడును దుఃఖించడు. ఏమియును కోరడు. సర్వభూతములందును సమత్వముతో ఉండును. అట్టివాడు ఉత్కృష్టమైన నా భక్తిని పొందుచున్నాడు.

* భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్. 55

ఆ నా భక్తిచే నన్ను - నేనెట్టివాడనో, ఎవడనో - యథార్థ స్వరూపముతో తెలిసికొనుచున్నాడు. అట్లు నన్ను తెలిసికొని, ఆ జ్ఞానముతో అవ్యవహితముగ నన్ను పొందుచున్నాడు.

* సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్. 56

నన్నాశ్రయించినవాడై, సర్వకర్మలను చేయుచున్నను, నా అనుగ్రహముచే శాశ్వతమైన పరమపదమును పొందుచున్నాడు.

* చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ. 57

మనసా సర్వకర్మలను నాయందు దర్పించి, సమత్వరూపమైన బుద్ధియోగమును ఆశ్రయించినవాడవై, నన్నే పరమగతిగ ఎంచి, సతతము నాయందే చిత్తము కలవాడవు కమ్ము.

* మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అథ చే త్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి. 58

నాయందే చిత్తము నిలుపగలిగినచో, నా అనుగ్రహముచే సకల కష్టములను అనాయాసముగ దాటగలవు. అహంకారమువలన నామాటలు వినవేని తప్పక చెడిపోదువు.

* య దహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి. 59

నా మంచిచెడ్డలను నేనే విచారించుకొనగలను అను అహంకారము వలన, యుద్ధము చేయనని, నీ యొక్క ఆ నిశ్చయము వృథమైనదే అగును. నీ ప్రకృతియే నిన్ను బలవంతముగా యుద్ధమున ప్రవేశపెట్టును - తప్పదు.

* స్వభావజేన కౌంతేయ ! నిబద్ధ స్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి య న్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్. 60

అర్జునా ! అజ్ఞానమువలన దేనిని చేయనని నిశ్చయించితివో, నీ ప్రకృతివలన బంధింపబడిన నీవు, నీ కిష్టమున్నను, లేకపోయినను, అవశుడవై తప్పక దానినే చేయుదువు.

* ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా 61

సర్వేశ్వరుడనైన నేను, సర్వభూతములయొక్క హృదయ ప్రదేశములందు ఉన్నవాడనై, యంత్రముల నెక్కిన మానవులను వలె, సర్వభూతములను మాయచే నడుపుచున్నాను.

* తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత !
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. 62

కాబట్టి, అన్నివిధములచేతను ఆ పరమాత్మనైన నన్నే శరణు పొందుము. భగవానుడనైన నా అనుగ్రహముచే శాశ్వతమైన శాంతిపదమును పొందగలవు.

* ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు. 63

ఈ విధముగ నీకు శ్రేష్ఠములలో శ్రేష్ఠతరమైన జ్ఞానమును బోధించితిని. చక్కగ ఆలోచించుకొని, నీ కేది ఇష్టమో దానిని చేయుము.

* సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్. 64

అర్జునా ! నీవు నాకు ఇష్టుడవును, భక్తుడవును కనుక, శ్రేష్ఠతమమైన జ్ఞానమును చెప్పుచున్నాను వినుము. ఇది నీకు చాల హితమైనది.

* మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. 65

ఎల్లప్పుడును నాయందే చిత్తము కలవాడవు కమ్ము. నా భక్తుడవు కమ్ము. నా ఆరాధనమే చేయుము. నాకు నమస్కారములను చేయుము. ఇట్లు నాయందనన్యుడవై ఉన్నచో నన్నే పొందగలవు. నీవు నాకు చాల ప్రియుడవు కనుక ప్రమాణముచేసి సత్యమును చెప్పుచున్నాను.

* సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః 66

అన్ని ధర్మములను పరిత్యజించి నన్నొక్కనినే శరణు పొందుము. నేను నిన్ను సర్వపాపములనుండి విడిపించి మోక్షము నిచ్చుచున్నాను. నీవు ఏమాత్రమును దుఃఖపడవలసిన పనిలేదు.

* ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన
నచాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి 67

ఇప్పుడు నీకు బోధించిన ఈ గీతామృతమను జ్ఞానమును, తపస్సు లేనివారికి, భక్తులు కానివారికి, శుశ్రూష చేయనివారికి, నాయందసూయ కలవారికి- ఇట్టివారి కెప్పుడును చెప్పకుము.

* య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః 68

ఈ పరమరహస్యమైన జ్ఞానమును నా భక్తులకు బోధించువాడు నాయందు పరమభక్తి లభించి నన్ను పొందుచున్నాడు. సంశయము లేదు.

* న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి. 69

ఈ విధముగ గీతాశాస్త్రమును యథారీతిగ పఠించి, దాని మర్మమును తెలిసికొని నాభక్తులయందు చక్కగ ప్రచారము చేయువానికంటె నాకు ప్రియమైన కార్యమును చేయువాడు వేరొకడు లేడు. పృథ్వియందు వానికంటె నాకు ప్రియమైనవాడు ఇంతవరకు కలుగలేదు. ఇకముందు కలుగబోడు.

* అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః
జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్యా మితి మే మతిః. 70

మన కిద్దరకును జరిగిన సంవాదరూపమైన ధర్మరూపమగు ఈ గీతాశాస్త్రమును ఎవఁడు శ్రద్ధాభక్తులతో అధ్యయనము చేయునో వాఁడు జ్ఞానయజ్ఞముచేత నన్ను పూజించినవాఁడని నానిశ్చయము.

* శ్రద్ధావా ననసూయశ్చ శృణుయాదపి యో నరః
సోఽపి ముక్తశ్శుభాన్ లోకా న్ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్.

అంతేకాదు సుమా అర్జునా ! అసూయలేనివాఁడై శ్రద్ధతో దీనిని వినినవాఁడు కూడ సర్వపాపములనుండి విముక్తుఁడై, ఉత్తమ కర్మము చేసినవారు పోవు పుణ్యలోకములకు పోవుచున్నాఁడు.

* కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ ! త్వ యైకాగ్రేణ చేతసా
కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రణష్ట స్తే ధనంజయ ! 72

అర్జునా ! నేను చెప్పిన ఈ ఉపదేశమును ఏకాగ్రచిత్తముతో వింటివా ? ధనంజయా ! అజ్ఞానము వలన గలిగిన నీ మోహము పూర్తిగ నశించినదా ?

అర్జున ఉవాచ :

* నష్టో మోహ స్స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాచ్యుత !
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ. 73

అర్జునుడు చెప్పుచున్నాఁడు :

హే అచ్యుతా ! నీ కృపావిశేషముచేత నా మోహమంతయు నశించినది. నా అంతఃకరణమందలి మోహము పోయి యథార్థ జ్ఞానము కలిగినది. ఇప్పుఁడు సందేహములన్నియు పోయినవి. చంచలరహితుఁడనై నీ ఉపదేశమందే శ్రద్ధ ఉంచెదను; ఇక నీ వేమి చెప్పిన అది చేసెదను.

సంజయ ఉవాచ :

* ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్. 74

సంజయుడు చెప్పుచున్నాడు :

ఈవిధముగ పరమాత్మయైన వాసుదేవునియొక్కయు, మహాత్ముడైన అర్జునుని యొక్కయు మహాద్భుతమైన సంవాదమును నేను వింటిని. దేహము ఉప్పొంగి పులకితమగుచున్నది.

* వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేత ద్గుహ్యతమం పరమ్
యోగం యోగేశ్వరా త్కృష్ణా త్సాక్షా త్కథయతస్స్వయమ్. 75

వ్యాసమహర్షి అనుగ్రహముచే దివ్యదృష్టిని పొంది, యోగేశ్వరుడైన కృష్ణపరమాత్మ అర్జునునిగూర్చి చెప్పుచుండగ, పరమ గోపనీయమైన ఈ ఉపదేశమును ప్రత్యక్షముగ వింటిని.

* రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్
కేశ వార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః. 76

ఓ రాజా ! కృష్ణార్జునులయొక్క ఈ అద్భుత సంవాదమును తలచుకొని, మాటిమాటికి ఆనందమున ఉప్పొంగుచున్నాను.

* తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః
విస్మయో మే మహా న్రాజ న్హృష్యామి చ పునఃపునః. 77

భక్తుల పాపములను హరించునట్టి, అంతరంగభక్తుల మానసములను హరించునట్టి, ఆ పరమాత్మ అర్జునునకు చూపించిన అద్భుతమైన ఆ విశ్వరూపమును తలచుకొనిన కొలదిని, రాజా ! మాటిమాటికి నా కపరిమితమైన ఆశ్చర్యమును, ఆనందమును కలుగుచున్నవి.

* యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ. 78

హే రాజా ! నా నిశ్చయము చెప్పుచున్నాను వినుము- యోగేశ్వరుడైన కృష్ణపరమాత్మ ఉన్నచోట, ధనుర్ధరుడైన పార్థుడు ఉన్నచోట - అక్కడనే - లక్ష్మి, విజయము, ఐశ్వర్యము, చలించనట్టి నీతియును ఉండును.

ఓం తత్ సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షసన్న్యాస
యోగోనామ అష్టాదశోఽధ్యాయః

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం యదుగిరి
యతిరాజ సంపత్కుమార మునీంద్రాణాం శిష్యేన
సీతారామ యతినా విరచితం శ్రీ గీతామృతమ్

స ర్వం సం పూ ర్ణ మ్.



ఓం శ్రియఃపతయే నమః
ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీమద్భగవద్గీతా మాహాత్మ్యమ్

ధరోవాచ :

* భగవన్ పరమేశాన భక్తి రవ్యభిచారిణీ
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో ! 1

భూదేవి అడుగుచున్నది :

ఓ పరమాత్మా! ఓ ప్రభూ! ప్రారబ్ధమును అనుసరించి కష్ట సుఖములు, లాభనష్టములు మొదలగు ద్వంద్వములను అనుభవించుచుండు మానవులకు నీయందలి అచంచలభక్తి ఎట్లు లభించగలదు ?

శ్రీ విష్ణు రువాచ :

* ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరత స్సదా
స ముక్త స్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే. 2

శ్రీ విష్ణుమూర్తి చెప్పుచున్నాడు :

మానవుడు ప్రారబ్ధమును అనుభవించుచున్నను, నిరంతరము గీతలను అభ్యసించుచున్నయెడల, ఈ లోకముననే ముక్తుడై శాశ్వత సుఖమును అనుభవించును. కర్మచే అంటబడడు.

* మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతిచేత్
క్వచి త్స్పర్శం న కుర్వంతి నళినీదళ మంభసా. 3

గీతలో చెప్పబడిన రీతిని పరమాత్మను ధ్యాన మొనర్చుచుండిన యెడల, అట్టివానిని, తామరాకునకు నీరంటనట్లు, ఎంటువంటి పాపములైనను అంటవు.

* గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్రవై. 4

ఈ భగవద్గీతాగ్రంథ మున్నచోట, ఈ గీతాపఠనము జరుగుచున్నచోట, ఈ గీతాప్రచారము జరుగుచున్నచోట ప్రయాగ మొదలగు సర్వతీర్థములును తప్పక ఉండును.

* సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చ యే
గోపాలా గోపికా వాపి నారదోద్ధవ పార్షదైః
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే. 5

సమస్త దేవతలును, ఋషులును, యోగులను, పన్నగులును, గోపాలురును, గోపికలును, నారదుడును, ఉద్ధవుడును, ద్వారపాలకులను మొదలగువారందరును అక్కడ ఉండి, వెంటనే సహాయము చేయుదురు.

* యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్
తత్రాహం నిశ్చితం పృథ్వి ! నివసామి సదైవ హి. 6

ఓ భూదేవీ ! గీతయొక్క అర్థవిచారము, పఠనము, పాఠనము, శ్రవణము జరుగుచుండుచోట సర్వదా నేను నివసించుచున్నాను. ఇది నా నిశ్చయము.

* గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్లోకా న్పాలయా మ్యహమ్. 7

నేను గీతను ఆశ్రయించియే ఉందును. గీతయే నాకు ఉత్తమమైన గృహము. గీతాజ్ఞానము ననుసరించియే నేను మూడులోకములను పాలించుచున్నాను.

* గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వానిర్వాచ్య పదాత్మికా. 8

గీత నా తత్త్వమును తెలియజేయు శ్రేష్ఠమైన విద్యయును, పర బ్రహ్మ స్వరూపమును. ఈ గీతాజ్ఞానము కేవలము మోక్ష ప్రదము; నాశము లేనిది; నిత్యమైనది; చెప్పనలవిగాని పరమపద వైభవముతో కూడినది - సందేహము లేదు.

* చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్
వేదత్రయీ పరానందా తత్త్వార్థజ్ఞాన మంజసా. 9

వేదసారము, బ్రహ్మానందము నిచ్చునది తత్త్వజ్ఞానమును ప్రబోధించునది అగు ఈ గీత సచ్చిదానంద పరబ్రహ్మమగు శ్రీకృష్ణునిచే అర్జునునకు బోధింపబడినది.

* యోఽష్టాదశ జపే న్నిత్యం నరో నిశ్చల మానసః
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్. 10

నిత్యమును పదునెనిమిది అధ్యాయములు నిశ్చలమానసుడై పఠించువాడు జ్ఞానసిద్ధిపొంది, తుదకు పరమపదమును పొందు చున్నాడు.

* పాఠేఽసమర్థ స్సంపూర్ణే తదర్థం పాఠమాచరేత్
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః 11

నిత్యపారాయణము పూర్తిగా చేయుటకు శక్తిలేనివాడు, తొమ్మిది అధ్యాయము లయినను పఠించవలెను. దానివలన గోదానఫలము పొందును రనుటకు సందేహము లేదు.

* త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్. 12

ఆరు అధ్యాయములు పారాయణము చేసినచో గంగానదీ స్నాన ఫలము కలుగును. అందుకును శక్తిలేక మూడధ్యాయములే పఠించినచో, సోమయాగఫలము లభించును.

* ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తిసంయుతః
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసే చ్చిరమ్. 13

నిత్యమును ఒక అధ్యాయమైనను భక్తితో పారాయణ చేయువాడు రుద్రలోకముచేరి ప్రమథగణములతో చిరకాలముండును.

* అధ్యాయ శ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః
స యాతి నరతాం యావ న్మనుకాలం వసుంధరే. 14

ఓ భూదేవీ! నిత్యమును ఒక అధ్యాయముగాని, శ్లోక పాదమునుగాని పఠించువాడు, మన్వంతరము వరకును మానవుడై జన్మించుచుండును.

* గీతాయా శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్
ద్వి త్రి ఏకం తదర్ధం వా శ్లోకానాం యః పఠేన్నరః 15

* చంద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువమ్
గీతాపాఠ సమాయుక్తో మృతో ఽమానుషతాం వ్రజేత్. 16

గీతలో పదిగాని, ఏడుగాని, ఐదుగాని, నాల్గుగాని, మూడుగాని, రెండుగాని లేక అర్ధశ్లోకముగాని నిత్యము పారాయణ చేయువాడు, చంద్రలోకముచేరి పదివేల సంవత్సరము లుండును. గీతను స్మరించుచు మృతి పొందువాడు, తిరిగి మానవజన్మనే పొందగలడు.

* గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమామ్
గీతే త్యుచ్చార సంయుక్తో మ్రియమాణో గతిం లభేత్. 17

అతడు మరల గీతాపఠనముచేసి, ఉత్తమమగు ముక్తినిపొందును. మరణవేళ 'గీత' అన్న శబ్దము ఉచ్చరించినను సద్గతి దొరకును.

* గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతో౽పి వా
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే. 18

గీతార్థమును వినుటకు ఆసక్తికలవాడు,మహాపాపియైనను వైకుంఠమును పొంది విష్ణువుతో ఆనందమును అనుభవించును.

* గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః
జీవన్ముక్తస్స విజ్ఞేయో దేహాంతే పరమం పదమ్. 19

నిత్యనైమిత్తిక కర్మల చేయుచు, నిత్యమును గీతార్థమును ధ్యానించుచుండువాడు జీవన్ముక్తుడు. అతడు శరీరమును విడిచిన పిదప పరమపదమును పొందును.

* గీతా మాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః
నిర్ధూత కల్మషా లోకే గతా హ్యంతే పరం పదమ్. 20

గీత నాశ్రయించియే జనకుడు మొదలగు రాజులు పాపముక్తులని ప్రఖ్యాతిగాంచి పరమగతి పొందిరి.



* గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్
వృథాపాఠో భవే త్తస్య శ్రమ ఏవ ఉదాహృతః 21

గీతను పారాయణచేసి, మాహాత్మ్యము చదువని యెడల ఫలశూన్యమై, శ్రమమాత్రము మిగులును.

* ఏత న్మాహాత్మ్య సంయుక్తం గీతాభ్యాసం కరోతి యః
స తత్ఫల మవాప్నోతి దుర్లభాం గతి మాప్నుయాత్. 22

మాహాత్మ్యముతో కూడ గీతలను పారాయణ చేసిన యెడల, పైన చెప్పబడిన ఫలముతో పాటు మోక్షప్రాప్తి కలుగును.

సూ త ఉ వా చ :

* మాహాత్మ్య మేత ద్గీతాయా మయా ప్రోక్తం సనాతనమ్
గీతాన్తే చ పఠే ద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్. 23

సూతమహర్షి చెప్పుచున్నాడు :

నేను చెప్పిన ప్రాచీనమైన ఈ గీతామాహాత్మ్యమును గీతా పఠనానంతరము పఠించువాడు పైన చెప్పబడిన ఫలమును పొందుచున్నాడు.

ఓం తత్ సత్

ఇతి శ్రీమద్భగవద్గీతా మాహాత్మ్యమ్.

